# ప్రధమాశ్వాసము

## అవతారిక

## ఇష్టదేవతా స్తుతి

**శ్రీవృత్తము**

**శ్రీ**

**వి**

**ఘ్నే**

**శా!** **1**

**(పాదమునకొక గురువు - అప్పకవీయం - క్ర.సంఖ్య - 1)**

**స్త్రీ వృత్తము**

**దేవా**

**నీవే**

**ప్రోవన్**

**రావా!** **2**

**(పాదమున 2 గురువులు – ప్రాస ఉన్నది -అప్పకవీయం - క్ర.సంఖ్య - 2)**

**కం. ఏమీ వ్రాయగలేనని**

**స్వామీ నీ పదములంటి సాష్టాంగమునన్**

**నామమ్ముల బలుకగనే**

**ధీమతినై సాగుచుంటి తిరుగేలేకన్!** **3**

## శివస్తుతి

**చం. అభయమునిచ్చి ప్రోచు కరుణామృతమూర్తి వటంచు సన్మతిస్**

**శుభములనివ్వ  మ్రొక్కితిని చొక్కిశివా!  పరమేశ్వరా! హరా!**

**విభవములిమ్ము నాకనుచు వేడగబోవను నన్ను నమ్ముమా**

**శుభములనిచ్చి నా రచన సూనృతమై నిలుపంగ వేడెదస్!** **4**

## గౌరీ స్తుతి

**ఉ. అమ్మలగన్న యమ్మవని, అమ్మలు గొల్చెడి ఆదిమాతవై**

**కొమ్మలు వేడినంతమరి కోరిక దీర్చెడు కొంగుబంగరై**

**నమ్మిన వారి వారి కాత్మవయి నాదవినోదిని వైన గౌరి! బల్**

**కమ్మని కావ్య ధారలును, గమ్యము దప్పని బాటజూపుమా!** **5**

## విష్ణు స్తుతి

**కం.మాధవ కేశవ యనగా**

**బాధల తొలగించబూను పరమాత్మా! నీ**

**గాధలనే వచియించుచు**

**శ్రీధర నీ భజన సేతు చిత్తమునందుస్** **6**

## లక్ష్మీ స్తుతీ

**కం. అమ్మా జననీ గైకొను**

**మమ్మా మావందనములు మాధవు రాణీ**

**ఇమ్మా అగణిత సుఖముల**

**రమ్మా మా సదనమునకు రయముగ లక్ష్మీ!** **7**

## వాణీ స్తుతి

**కం. కవిగా కలమును బట్టితి**

**నవ భావనలిచ్చి నన్ను నడుపుము వాణీ**

**కవనములో నా కలమున**

**నివసింపుము ననవరతము నిన్నే కొలుతున్.** 8

## సుకవి స్తుతి

**ఉ. నన్నయ తిక్కయజ్వకవి నాచనసోమన యెఱ్ఱనాదులున్**

**పొన్ను కవిత్వధీనిధులు పోతనయున్ కవిసార్వభౌముడున్**

**ఎన్నగ నన్నెచోడుడు కవీంద్రుడు రాయలు పెద్దనాదులున్**

**అన్నుల మిన్న మొల్లయు రసార్ద్ర వచోనిధి వేంగమాంబయున్** 9

**ఉ. ఎందరో ఎందరో సుకవులేర్పడ జేసిరి కావ్య వృక్షముల్!**

**విందులు జేయుచుంటిమిల వేడుక మీరగ తత్ఫలంబులన్**

**పొందిక తోడనాంధ్రులటు పొందిరి కావ్యరసానుభూతులన్**

**గ్రంథములన్నియున్ మిగుల గౌరవ కారణమాంధ్ర జాతికిన్** 10

## గురు స్తుతి

**ఆ.వె. తల్లి, తండ్రి, అన్న దాక్షిణ్యవార్నిధై**

**చదువు జెప్పె నాకు ముదము తోడ**

**గురువు లెంత మందొ గుర్తేమి లేదయా**

**వారికెల్ల మిగుల వందనమ్ము** 11

## కుకవి నింద

**తే.గీ. పద్య రచనన్న తెలియని బంధు జనులు**

**గొప్ప బోధలు జేయంగ గుందు మనసు**

**తప్పులెన్నుటె ఘనమను తత్త్వమున్న**

**వారి కెల్లర జేయుదు వందనములు 12**

## షష్ఠ్యంతములు

**కం. శ్రీరామునకుస్ సీతకు**

**శ్రీరామానుజులకుస్ హరీంద్రునకు స**

**ద్ధీరుడు పవన సుతునకు**

**శ్రీరామాయణ కవికిదె చేయుదు వినతుల్ 13**

**కం. అరవింద లోచనునకుస్**

**దరికిస్ జేరగ శరణిడు ధర్మాత్మునకుస్**

**వరకరుణామృత మూర్తికి**

**కరమున కోదండమున్న ఘనవీరునకుస్ 14**

**కం. ఇనకుల వంశాబుధునికి**

**ఘన పాపమ్ముల కడిగెడు గంగ సమునికిస్**

**జనకుని ప్రియ జామాతకు**

**మనమున సీతనె జపించు మహిమాన్వితుకుస్. 15**

**కం. కామితము దీర్చు వానికి**

**తామస కల్మషములడచు దైవ సమునికిన్**

**భూమీశ వినుత గుణునకు**

**నామతి శోభించి నిలుపు నఖిలేశ్వరుకున్. 16**

**కం.రవికులవంశోద్భవునికి**

**కవికుల వాల్మీకి కావ్య కారణ జనికిన్**

**చవులూరించుచరితకు నె**

**లవుగను తా నిల్చినట్టి లాలిత్యునకున్ 17**

**కం.రామునకున్ సుగుణాలయ**

**రామునకున్ ఆశ్రితజన రక్షాగ్రణికిన్**

**భామాజానకి మానస**

**సీమాచోరాగ్రగణ్యు శ్రీ రామునకున్ 18**

**అంకితంబుగా నే రచియింపబూనిన "ధర్మదత్తో దయం" బను సామాజిక జీవన ప్రబంధ కథా క్రమంబెట్టిదనిన**

**వ. ద్వాపరంబున పాండవులు వనవాస క్లేశమ్ములనుండ నొకనాడు మార్కండేయమహర్షి అవ్వనంబున కేతెంచి, అర్ఘ్యపాద్యాదులు స్వీకరించి సుఖాశీనుడై, ధర్మరాజుతో ద్వాపరమ్మునకు భరత వాక్యము, కలియుగమ్మునకు నాందీ వాచకము పలకబడే రోజులు సమీపించుచున్నవని మిక్కిలి వాపోయెను. ధర్మజుని కోరిక మేరకు మహర్షి చూసిన అనేక కలియుగములలోని విశేషములను తెలియజేయగా ధర్మజుడు విచలిత మనస్కుడై, మహర్షీ! కలియుగంలో ధర్మమార్గాన నడిచే మానవుడు ఒక్కడైనా ఉండడంటారా? అనగా, మహర్షి అలాంటి ధర్మాత్ములు కొంతమందైనా ఉండడం వలననే కలియుగంలో ధర్మం కనీసం ఒంటికాలితోనైనా కుంటుతూ నడవగలుగుతున్నదని విచారక్రాంతుడై సెలవిస్తాడు. పాండవాగ్రజుడు మహర్షీ! కలియుగంలో ఉన్న అలాంటి మహనీయుల గురించి తెలియజేయవలసినదని కోరగా, మహర్షి చిరునవ్వునవ్వి ధర్మజా!**

చిత్తశుద్ధి, దైవబలం ఉంటే కలియుగంలో సైతం మానవులు కలిబారిన పడకుండా ధర్మవర్తనులుగా జీవించవచ్చునని తెలియజేసే ఈశ్వరవరప్రసాదుడైన ధర్మదత్తుని చరిత్రను మీకు అవశ్య మెరింగించెదను. అలాంటి మహనీయులున్న ప్రదేశానికి కలిపురుషుడు తొంగిచూడడానికి కూడా భయపడతాడు. ఆ ధర్మదత్తుని చరిత్రను మీకు సాంగోపాంగముగా నెరింగించెదను, సావధాన చిత్తులై వినవలసినదని కోరి ఒక్కసారి కనులు మూసికొని మనోనేత్రాలతో పరంధాముని దర్శించి ఈవిధముగా చెప్పదొడంగెను. 19

## కథా ప్రారంభము

ఉ. శ్రీ లలరారు వాటికది సిద్ధుల నాగుల వాసమద్ది, స
ఛ్ఛీలత రాజులేలిరి విధేయత ధర్మము రాజిలంగ, న
క్కాలము మారిపోయె కలికాలమధర్మము పాదమూనె, భూ
పాలుర వృత్తిమారె పురవాసుల బాధల శక్యమై చనెన్ 20

## విజయవాటిక వర్ణన

తే.గీ. ఇంద్రకీలాద్రి ప్రజలకు నిహము పరము
కనక దుర్గమ్మ కొలువున్న కలిమికొండ
మల్లికార్జునుడున్నట్టి మహిత నగము
అమ్మ పెద్దమ్మ భక్తుల కండదండ 21

ఉ. జలజల పారుచుండునది చల్లని తల్లిగ సేదదీర్చెడున్
కలిమిని పెంచు తీరుగను కర్షకపాళికి కల్ప వృక్షమై
బలిమిని గుండె నిబ్బరము బాయక నిచ్చెడి కృష్ణవేణియై
పలుపలు రీతులన్ జనుల బాధల తీర్చెడు దివ్యతీర్థమై. 22

## వేంగీపుర వర్ణన

తే.గీ. విజయవాటిక విశ్వంబు విదిత మయిన

శక్తిపీఠము దాపున చక్కగాను

ఎనిమిదామడ దూరంబు నెంచి చూడ

వేంగిపురమను గ్రామంబు వెలసి యుండె 23

తే.గీ. రాజ నరేంద్రుడేలిన రమ్య పురము

పాడిపంటల తులతూగు పల్లె యనఘ!

పేదలుధనికులను బేధవృత్తిని వీడి

ప్రేమ భావ మార్గాన వర్తింత్రు జనులు 24

## సూర్యోదయ వర్ణన

ఉ. భానుడు తూర్పుదిక్కునొక బంతిగ తామ్ర సువర్ణ రూపుడై

పూనిక వెల్గుచుండె తన పోడిమి పేడిమి పంచుచున్ లలిన్

చేనికి నీరుపెట్ట తమ చేతుల కఱ్ఱల గొంచు రైతులున్

దీన ముఖమ్ములన్ బయలుదేరిరి పట్టెడు పొట్టకూటికై 25

తే.గీ. అత్త సణుగుడు ధాటికి నదిరిపడుచు

కొత్త కోడళ్ళు భయపడి చిత్తమనుచు

మగని కౌగిలి వీడిరి మత్తునొదలి

భర్త నెత్తిన మొట్టుచు బయట పడిరి 26

**ఉ. మందిర ఘంటికారవము మంజులతన్  జెవిసోక, తాళికిన్**

**వందనమాచరించి తమవంతు పనుల్ పొనరింప వేడుకన్**

**సుందర భామినీ మణులు సొంపుగ వాకిట ముగ్గుతోడ క**

**న్వీందులు చేయుచుంద్రు రమణీయ గుణోన్నతి పల్లెసీమలన్** **27**

**ఉ. మందలు మందలై చనెడు మాలిమి గోవులు గేదెలున్ గనన్**

**బంధుర భావనైకతకు మైత్రికి నియ్యవి చిహ్నమన్న హృత్**

**మందిరమందు నొక్క రసతత్త్వ విచారము గోచరించుచున్**

**సుందర దృశ్యమాలికలు చూడగ వచ్చును పల్లెసీమలన్** **28**

## <u>చాతుర్వర్ణ వర్ణన</u>

**ఉ. వీడరు సత్యధర్మములు వీడరు వేదచయమ్ము శాస్త్రమున్**

**వీడరు సంధ్యలెన్నడును విజ్ఞత నేర్చిన బ్రాహ్మణోత్తముల్**

**వీడరు దేవతార్చనము వీడరు వృత్తిని భక్తితత్త్వమున్**

**చూడరు తప్పు చెప్పరు విశుద్ధ విచారులు జ్యోతిషమ్మునన్** **29**

**ఉ. అమ్మరు గొప్పలాభముల కమ్మరు పుచ్చిన నాసివస్తువుల్**

**నమ్మిన వారికెల్లరికి నాణ్యత కల్గిన మేటి వస్తువుల్**

**నమ్మిన నమ్ముచుందురు వినమ్రత వైశ్యకులేశులప్పురిన్**

**తిమ్మిని బమ్మిచేయరు వినీతి విధానమె వారి భాగ్యమౌ!** **30**

**ఉ. రాజ్యము లంతరించినను రాజుల వంశములుండె వారిదౌ**

**భోజ్యపు భోగముల్ సమసి భోజన శాలలు దివ్యధామముల్**

**పూజ్యము లాయెసంపదలు పోయెను ద్రొక్కె మరొక్క మార్గమున్**

**రాజ్యము గోలుపోయినను భ్రాంతి తథాగతి నుండె వారికిన్** **31**

**తే.గీ. కులము వృత్తులు వీడక తలపు చెడక**

**ధనము వచ్చిన రాకున్న దైన్యపడక**

**జనుల తలలోని నాలుకై మనెడువారు**

**కలరు ధర్మార్థ భావ సంకలితులచట. 32**

**వ. ఆరోజులలో కృష్ణవేణీ నదీ మహాపుష్కరములు రాగా. 33**

## <u>వేంగి ప్రజలు కృష్ణవేణీ పుష్కరములకరుగుట</u>

**ఉ. వేంగిజనావళుల్ గలిసి వేడుక మీరగ నెడ్లబండ్లపై**

**పొంగిన భక్తితోడ మరి పూనిరి పుష్కర స్నానమాడగన్**

**చెంగట ఘట్టముల్ దిగిరి, చేరిరి దాపున దుర్గకొండకున్**

**అంగడి బొమ్మలన్ గొనుచు నందరు సాగిరి దర్శనానికిన్ 34**

**తే.గీ.పసుపు మెట్లకు బూసి సద్భక్తి తోడ**

**మెట్టు మెట్టుకు కుంకుమ బొట్టు పెట్టి**

**అమ్మవారిని దర్శించి ఐదువలకు**

**వాయనములిచ్చి మ్రొక్కిరి వనితలలరి. 35**

## <u>కనకదుర్గ గుడిలో ధర్మపాలుడను తప్పిపోయిన బాలుడు దొరుకుట</u>

**తే.గీ.పాద రక్షలు దాచు ప్రాంతమ్ము చెంత**

**బావురనుచు నేడ్చుచునుండె బాలుడొకడు**

**తల్లిదండ్రుల గానక తల్లడిల్ల**

**నరసి వేంగి ప్రజావళి దరికిచేరి 36**

**తే.గీ. "ఎవరు నీవారు జెప్పుము? యేడుపాపి"**

**"తెలియదేమియు నాకని" తిరిగి యేడ్చె**

**మూడు గంటల కాలమ్ము ముగిసె నటుల**

**దేవులాడిరి జనులెల్ల దేవళమున 37**

**ఆ.వె. ధర్మపాలుడనుచు తనపేరు మాత్రమే**

**ఎనిమిదేళ్ళ బాలు డెరుగజేసె**

**మైకులోన పేరు మరి మరి చెప్పించె**

**జాడ తెలియరాదు ఝాముదాటె 38**

## ధర్మపాలుని వేంగిపురమునకు తీసుకొని వెళ్ళుట

**ఆ.వె. వేంగి పెద్ద దిక్కు వీరయ్య దొర చూచి**

**మనమె పెంచుటెంతొ మంచిదనియె**

**బాబు నెత్తుకొనిరి బాటను బట్టిరి**

**ఎద్దు మువ్వ మ్రోగ నేడుపాగె 39**

**తే.గీ. పిల్ల పాపలు లేనట్టి పేద దాది**

**సాక సాగెను బాలుని చక్కగాను**

**మంచి బుద్ధులు నేర్పించె, మమత బంచె**

**వేంగి సీమకు ఆమె ఓ వెలుగునింపె 40**

**ఆ.వె. చదువ బడియు లేక చాకలి పద్దుకే**

**చదువు ముగిసి పోయి సాగ కుండ**

**మంది మనసు గెలిచె మంచిగ నచ్చుట**

**అన్ని పనుల యందు అంది వచ్చె 41**

**తే.గీ. ధర్మపాలుని సుగుణ సంపదను జూచి**

**దొడ్డ వాడని మెచ్చిరి తోటి జనులు**

**సెంటు భూమియు లేకున్న చెనటి వయసు**

**దానితో బాటు కాంక్షలు దాగునెట్లు? 42**

**ఆ.వె. వయసు మీద పడగ వరుసగ జబ్బులస్**

**నడుము వంగె నంత నలిగె నొడలు**

**దగ్గి దగ్గి ముసలి ధరణిని వీడంగ**

**చేయ దగిన కర్మ చేసినాడు 43**

## ధర్మపాలుని యవ్వనమున పల్లెలోని బాలికలు మరులు గొనుట

**ఉ. కోడెవయస్సు కోరికల గూడని పెద్దలు చెప్పుచుందురా**

**కోడె వయస్సు ధర్మునికి కోరిక లీరిక లెత్తుతోడుతస్**

**పోడిమి చూపె మీసముల పొందిక యౌవన శోభచాటె పూ**

**బోడుల చూపులందు బడి మోహము తాపము రేపె మెల్లగస్ 44**

**ఉ.కాముని రూపసంపదను గైకొనియట్లె జయంతునందముస్**

**సోముని సత్కళా రుచిని చుక్కల కాంతిని తోడుజేసి య**

**య్యామిని నేలు వాని సొబగంతయు ముద్దగజేసి ధాత యీ**

**భూమికి "ధర్మపాల" వరమూర్తిగ సృష్టి ని జేసె నేర్పునస్ 45**

**తే.గీ. వాని  కుర్రమీసాలకు, వాని కొంటె**

**చూపులకు, వాని చిరునవ్వు సోకులకును,**

**వాని మధుర భాషణముల, వాని రూప**

**మునకు, మోహమందని యట్టి పూబోడి లేదు** **46**

**ఆ.వె. వాని చూపు కొరకు బ్రతికెడు వనితలు**

**వాని చూపు కొరకు బ్రతుకు  యువతు**

**లెందరో గలరట స్వేఛ్ఛాను వర్తన**

**కేళికైన పెళ్ళి తాళికైన** **47**

**కం. ఏ యింటి కన్నె ధీరత**

**నాయింటి జనాళితోడ నెగ్గుస్ సిగ్గుస్**

**దాయక ప్రక్కల జూచుచు**

**తీయగ తన వాంఛితమ్ము తెలుపగ వారల్** **48**

## కులగోత్రములు లేని ధర్మపాలునికి ఊరిపెద్దలు అన్నపూర్ణతో వివాహము గావించుట

**చం.తనయల రాగభావమును తన్మయతస్ గమనించి వారు ధ**

**ర్మని కులగోత్రముల్ బ్రతుకు పోడిమి ధీగణి యిద్ది మే**

**ల్పని యెటుతాను బంధుగుల పంచన చుల్కన కామె? వద్దు వీ**

**ని నియతి పెండ్లియాడుటని నీళ్ళను జల్లిరి యాశపై.** **49**

ఉ. పెద్దలు రచ్చబండ జని పేదగు కొమ్మను భార్యజేయగన్

సిద్ధము జేసిరొక్కరిని శీఘ్రమె జేయగ పెండ్లి వానికిన్

ముద్దుగ బెంచగా తనయ మోహము పేరిట జాతిమారకన్

సద్దును జేయకన్ బిలిచి సంగతి దెల్పిరి ధర్మపాలుకున్ 50

ఆ.వె. అన్నపూర్ణ యనెడి యందాల భరిణెను

కట్ట బెట్టిరంత గుట్టుగాను

ఆపె సుగుణ శీలి యాదర్శ మహిళంచు

వేంగి వాడ యంత విశద మాయె 51

## ధర్మపాలుడు భార్య అన్నపూర్ణతో కలిసి పుణ్యక్షేత్రములకు జనుట

వ. ధర్మపాలుడామెను గొని సమీప పుణ్యక్షేత్రములకు జనియె. 52

ఉ. చేరిరి వేంకటే శ్వరుని చిత్తము నందున కోటికోర్కెలన్

దారిన కాళహస్తిదిగ దక్కెను వారికి రాహుపూజలున్

తీరుగ కాణిపాకమున దిక్కని మ్రొక్కిరి విఘ్ననాయకున్

కోరిరి వంశ పుత్రకుని కోవిదునిమ్మని భక్తిభావనన్ 53

ఉ. ఎవ్వనికేది యీయవలె నెట్టుల నీయవలెన్ ఫలమ్ములా

ముప్పురు వేల్పులా తరుణమున్ గమనించుచు నిచ్చుచుందురా

ముప్పురి వేల్పులాత్మ కడు మోదము జెందెను వీరిభక్తికిన్

నెవ్వగ తీర్పనెంచిరి వినీత సుబుద్ధి నొకింత నేర్పునన్ 54

## కాణిపాక క్షేత్రమున జరిగిన దైవ సంఘటన

**మం.ద్వి. కాణిపాక క్షేత్ర గణపతిన్ జూచి**

**వివిధార్చనలతోడ వేల్పును గొలిచి**

**పూనిన భక్తితో పూజ్యభావాన**

**గోపులం పూజించి గుడి చుట్టు తిరిగి**

**ఒక చెట్టు నీడలో నొదిగి కూర్చుండ**

**ధర్మ పాలుని వాని దార నమ్రతను**

**గుడికి వచ్చిన భక్తకోటి దర్శించి**

**ఆదర్శ దంపతులనురాగ భరిత**

**జీవనులంచు సచ్చిత్తాన దలచి**

**కైమోడ్పు లిడుచుండ కమ్ర భావాన**

**వారునున్ వందించి భగవంతునాత్మ**

**సంధాన మొనరించి సన్నుతుల్ సేయ**

**సమయాన నెటునుండొ సామజమ్మొకటి**

**గబగబా నటువచ్చి గణపతింజూచి**

**ఘీంకార మొనరించి కెరలి యిటు వచ్చి**

**ధర్మపాలుని జూచి తలయూచి తనిసి**

**చెట్టు కొమ్మను పూల చెండుతోబాటు**

**త్రుంచి వారల యొడినుంచి తొండమున**

**వరమిచ్చినట్లుగా వారి శిరమ్ము**

**తాకించె తొండమ్ము దైవలీలగను**

**ముందుకాళ్ళను ఎత్తి మోకరిల్లంగ**

**ఆవింత కందరు నాశ్చర్య పడిరి** **55**

**మ. కలయా! వైష్ణవ మాయయా! విబుధ సంకల్పార్థ భావమ్మ! అ**

**ట్టుల మాతంగము వచ్చుటేమి? సుమమిట్టుల్ పంచి, శీర్షమ్ములన్**

**లలి తొండమ్మున తాకుటేమి? యనుచున్ భక్తుల్ నుతుల్ సల్ప వా**

**రలు సత్పూత మనమ్మునన్ గణపతిన్ శ్రద్ధావిధిన్ గొల్చుచున్ 56**

**<u>దండకము.</u> శ్రీపార్వతీ శంకరాత్మీయ పుత్రా! లసత్ సూర్య చంద్రాను రూపాభి శోభాది దిగ్మండలవ్యాప్త పర్యాప్త నేత్రా! బృహద్ధీ గురుత్వార్థ విద్వాంస పాండిత్య సుశ్లోక సంస్తుత్య పాత్రా! స్ఫురత్ దివ్య గాత్రా! పవిత్రార్థ కార్యాధిభూతా! నమో విఘ్న రాజా! నమస్తే నమస్తే నమ: 57**

**కం. అని విప్రుల నుతియించెడి**

**గణపతి దండకము వినుచు గణనాథునెదన్**

**కొనియాడుచు తనకాంతను**

**వనజముఖిన్ గాంచె ధర్మపాలుడెలమిన్ 58**

**ఆ.వె. మగని చూపులోని మర్మమ్ము గుర్తించి**

**మొలక నగవు లొలుక పొలతి మిన్న**

**తనదు భాగ్య గరిమ తలపోసి సంతృప్తి**

**భర్తృ పదములంటె భక్తి మెరయ 59**

## <u>ఆశ్వాసాంత పద్యము</u>

**భు.ప్ర. సరోజాక్ష! సంగీత సాహిత్య వాఙ్మా!**

**ధురీ పానలోలా! హితోర్వీ నృపాలా!**

**కరీంద్రార్తి దూరా! సుకర్మాధికారీ!**

**హరీ! భక్త రక్షా క్రియానంద మూర్తీ! 60**

**(య,య,య,య యతి 1-8 - అప్పకవీయం - క్ర.సంఖ్య - 84)**

**ఆశ్వాసాంత గద్యము: ఇది శ్రీవాధూలస గోత్రపవిత్ర టేకుమళ్ళ హనుమాయమ్మా సుబ్రహ్మణ్యాఖ్య చతుర్థ పుత్ర, సహృదయ, కవిమిత్ర, శ్రీ పరమాత్మ గురుకటాక్షవీక్షణాలబ్ధ సారస్వతమర్మ వేంకటప్పయ్యాశర్మ ప్రణీతంబైన ధర్మదత్తోదయంబను ప్రబంధంబునం ప్రథమాశ్వాసంబు సమాప్తము.**

**-OOO-**

# ద్వితీయాశ్వాసము

**కం.శ్రీ రామా! జనపాలక!**

**కారుణ్యామృత రసార్ద్ర కమనీయ గుణా!**

**మేరువు తీరుగ నీదయ**

**కోరుచు నుంటిని శుభముల గూర్చుము దేవా!** **1**

**వ. ఒకనాటి తెల్లవారుఝామున ధర్మపాలునికి బందరు పాండురంగస్వామి స్వప్నంలో సాక్షాత్కరించగా.**

**2**

## ధర్మపాలుడు బందరు పాండురంగ క్షేత్రమునకు జనుట

**తే.గీ. పాండురంగని కోవెల పరమ భక్తి**

**చేరి పూజాసమర్చనల్ చేసి వారు**

**గొప్ప గుణములు కలిగిన కొడుకు నిమ్మ**

**టంచు ప్రార్థనల్ సల్పిరి యమిత భక్తి** **3**

**తే.గీ. గిల్టు నగలకు ఘనమగు కేంద్రమనుచు**

**ధనము చాలక కొనుటకు దడిసి వార**

**లన్ని యంగళ్ళ తిరుగుచు నలసి పోయి**

**ముక్కు పుడకలు కొనినంత మురిసిపోయె** **4**

## బందరు పట్టణమందలి సముద్ర తీరమునకు జనుట

**ఉ. సాగర శోభలన్ గనగ సంతస మౌనని చెప్పగా జనుల్**

**సాగిరి దంపతుల్ జరుగు సందడి జూడగ సంధ్యవేళకున్**

**మూగిరి గొప్పగా జనులు ముచ్చటలాడుచు తీరమందునన్**

**దాగని కాంక్షలన్ దడిసె దంపతు లప్పుడు తీపిభావనల్** **5**

## సాగర వర్ణన

**మ. ఘనకల్లోల తరంగ భంగములతో - గర్జోరు నాదాలతో**

**మునుకల్వేయుచు పైకిలేచి బలిమిన్ - మొప్పల్ త్రుటిన్నార్చి పే**

**మునుకల్వేసెడు మీన సంతతులతో బొంగారు ఫేనమ్ముతో**

**ఫణిరాడ్భూషణుడైన రుద్రుగతి విభ్రాజిల్లు నా తోయధిన్** **6**

**ఉ. భీకర శబ్దఘోషణల భీషణరూపము గాంచి నిల్వగా**

**పోకిరి పిల్లలాదరిని పూనిరి గొప్పగ నీదులాడుచున్**

**తోకలు లేనికోతులుగ తోచిన రీతిగ ఈతలాడుచున్**

**కేకలు వేయుచున్ మిగుల కేళిగ నాడుచు ముప్పుదల్చకన్** **7**

## సముద్ర విహారములో పిల్లవాడు అలలలో జిక్కుకొనుట

**తే.గీ. అంతకంతకు నేపుగా నలలు పెరిగి**

**తాళ వృక్షపు టెత్తును దాట సాగె**

**భయము జెందిన పిల్లలు బయటబడగ**

**అర్భకుడొకండు విధిలీల నందు జిక్కె** **8**

**ఉ. చేతుల నూపుచున్ నరచి చెంతకు రమ్మని సైగచేయుచున్**

**ఊతము నీయగా పిలిచె నూపిరి యాడక నీటమున్గుచున్**

**భీతిలి తల్లిదం డ్రులును బిగ్గర గానెలు గెత్తియేడ్చుచున్**

**మాతలరాత మార్చుమని మాతకు మ్రొక్కిరి దీన చిత్తులై** **9**

## అన్నపూర్ణ ధర్మపాలుని పిల్లవానిని రక్షింపమని కోరుట

వ. ధర్మపాలుడది గాంచి దిక్కుదోచక యుండగా భార్య యిట్లనెను. 10

ఉ. ఈతల యందుసాటియని యెల్లరు గుండెలు తట్టి పల్కిరే
మాతకు శోకమార్పుమిక మౌనము వీడుము కార్యశీలిపై
నాతర మౌనొకో యనుచు నాన్పగ రాదుగ యిట్టివేళలన్
భూతలమందునన్ జనుల పూనిక గాచెడి వాడె దేవుడౌ! 11

కం. అమ్మను నమ్ముడు శుభమగు!
లెమ్మిక కాపాడబూనరే! జాగేలా?
పొమ్మిక బాలుని తెమ్మిక
నమ్మిక యుండంగ వలయు నారాయణిపై 12

ఉ. మంగళ సూత్రమున్ తడిమి మాతను వేడెను మౌనమూని భ
ర్తం గనె ధర్మపాలుడు స్వధర్మ విధిందలపోసి ధీరతన్
చెంగున వార్ధిదూకి వెస జేరెను తీరము పిల్లవానితో
మ్రింగిన నీరు వెల్వడగ మెల్లగ బొట్టను నొక్కె వేగమే. 13

తే.గీ. తల్లిదండ్రులు ఏడ్చుచు దండమిడుచు
వేయి విధముల, బొగడుచు వెడల వారు
అన్నపూర్ణను గాంచగ నభయ మిచ్చు
గౌరి రూపున తలపించె కనులకపుడు 14

## వేంగిపురమున మద్యమమ్ముటకు పాకలు వేయుట

**వ. ఇట్లుండ ఆదినములలో నొకనాడు** **15**

**తే.గీ. రండు! రారండు! జనులార! రక్తి శక్తి**

**సుఖము సంతోష మిడునట్టి సురను గ్రోల**

**ననుచు సురనమ్మ వారలు పుణికి పుణికి**

**వాడ వాడల నరచుచు పలికిరిట్లు** **16**

**కం. సురలసురులు వారి స**

**ద్గురువులు-నేతలు-సచివులు-గొనకొని తృప్తిస్**

**సురద్రాగి రతుల దేలిరి**

**తరుణుల మెప్పులను గొనిరి - తనసిరి సురచే** **17**

**మం.ద్వి. అనుచు సురను గూర్చి యనువగు రీతి**

**పరమ బోధ సలుపు వారి వెన్వెనుక**

**పరుగులెత్తు జనుల హరుసమ్ము జూచి**

**మురిసిరి సురనమ్మ నరులు లోలోన** **18**

**ఉ. వేంగి శివార్లలోనొకడు వేసెను  పాకలు మద్యమమ్మగస్**

**చొంగలు గార్చి పూరుషులు చొక్కిరి బానిసలైరి దానికిస్,**

**భంగము నాయె సర్వమని భార్యలు శోకపయోనిధి మున్గి, యె**

**బ్భంగి దరింపనోపుదుమె పాడు సురాబ్ధిని ముస్గు భర్తలస్! 19**

**<u>అన్నపూర్ణ మద్యమమ్ము విషయమున విషాదము ప్రకటించుట</u>**

**వ. పడతులటులింటింటికీ కరపత్రములు పంచి, ఆ సాయంత్రవేళన ధర్మపాలుని భార్య అన్నపూర్ణతో గలిసి రచ్చబండ వద్ద విచారణ జరిపింపగా 20**

**ఉ. భారతజాతి నాశనము భాగవతమ్మున జెప్పె వ్యాసుడుస్**
**మారణ హోమహేతువుల మద్యమె నిల్చెడు దానిముందు సే**
**కారణ మెర్గియుస్ జనులు కాంక్షల వీడరదేమి చోద్యమో**
**వేరొక యోచనల్ గనక వేగమె నాపరె వేంగి బాగుకై 21**

**ఉ. శాసన సభ్యుడే యిటులశాంతికి కారణమన్న వార్తతో**
**మోసపు చర్యలస్ నిలుచు మూర్ఖపు మూర్తిని దల్చిబాధతో**
**మేసిన సొమ్ము చాలకయె మీరిన యాశకు విస్తుబోవుచుస్**
**వేసిరి కేకలస్ సతులు వేదన గద్గద ఖిన్నకంఠులై. 22**

**ఉ. పెద్దలు గొప్పగస్ మనుచు పేదల కష్టము కొల్లగొట్టుచుస్**
**సుద్దులు సెప్పువారలకు సోకునె? పేదల ఈతిబాధలుస్**
**మిద్దెల మేడలస్ నిలిపి మ్రింగుటె ధ్యేయము నంచునిల్చినస్**
**గద్దెను దింపగా వలయు గార్దభ నేతల సత్వరంబునస్ 23**

**<u>అన్నపూర్ణను వేంగి వాడలో నాయకురాలిగా ప్రకటించుట</u>**

**వ.అవ్విధంబున దలంచి స్త్రీలకు అన్నపూర్ణను  వేంగి వాడలో నాయకురాలిగా ప్రకటించి** **24**

**ఉ. వాడల వాడలన్ దిరిగి వంచన తీరుల నెండగట్టుచున్**

**కూడిరి యొక్కమాటగను కోమలులందరు వేంగి ప్రోలునన్**

**వేడిరి నాయకామణుల వేదన దీర్చగ రోదనమ్ముతో**

**పాడిరి పాటలన్ జనుల బాగును గోరుచు పల్లెపల్లెలన్** **25**

**ఉ. చేరిరి రాజధానికిని చెప్పిరి సర్వము నేతనేతకున్**

**కోరిరి కల్లుపాకలను కూల్చగ శాసన సభ్యులందరన్**

**చేరిరి ముఖ్యమంత్రికడ చేసిరి చర్చలు వచ్చె దీర్పిటుల్**

**భారము నార్థికస్థితికి పాలనమేగతి జేయగావలెన్** **26**

**<u>ముఖ్యమంత్రి మద్యపాన నిషేధము ప్రకటించుట</u>**

**వ. ముఖ్యమంత్రి వారికినిట్లు జెప్ప దొడంగెను** **27**

**తే.గీ. నేత జనులకు సౌఖ్య విభూతి గూర్చి**

**వారి రక్షణకై పాటు పడగ వలయు**

**ధనమె ముఖ్యమ్ము గారాదు ధరణియందు**

**పొదుపు పాటింప సరియౌను పూడు లోటు.** **28**

**తే.గీ. సుదతి మాటకు విలువిచ్చి సుఖము నెంచి**

**మద్యపాన నిషేధమే మంచి దనుచు**

**ఆజ్ఞ నిచ్చెను సత్వర మమలు జరుప**

**వనితలానంద మెల్ల నంబరము దాకె 29**

**అన్నపూర్ణ గర్భవతియగుట**

**తే.గీ. అలసి సొలసిన దేహాన యన్నపూర్ణ**

**పల్లె జేరెను సంతోష పర్వ మనుచు**

**గడప లోనను నడుగిడ కళ్ళు తిరిగి**

**వ్రాలె పెనిమిటి భుజముల వాకిలందె 30**

**వ. అంత ధర్మపాలుండు మిక్కిలి ఆవేదనా పరుండై 31**

**తే.గీ. పల్లెవైద్యుని బిలిపించె భయము నిండ**

**నాడి బట్టిన నిమిషమే నవ్వి తాను**

**నెలను దప్పిన విషయంబు నెఱుక పరచె**

**సంతసముపండ వెలుగుల కాంతి నిండ 32**

**ఆ.వె. గర్భవతిగ దాను గండమ్ములనుదాటె**

**బిడ్డ మేలు కొరకు వెతను మోసె**

**చిక్కి శల్యమాయె చీకాకు లెక్కుపై**

**నెలలు నిండె నంత నెలతకపుడు 33**

## అన్నపూర్ణ ధర్మదత్తుని ప్రసవించుట

**ఆ.వె. వైద్య శాలలు లేనట్టి వాడ వేంగి**

**మంత్రసానియె పని మంతురాలు**

**ఐదువంద లీయ నడుగిడె నింటికి**

**కాసునందె జగతి యూసులాడు 34**

**ఆ.వె. మంత్రసాని చమురు, మారేడు తెప్పించి**

**పూర్ణ చెంత జేరి పొలుపు గాను**

**చమురుపూసి బిడ్డ సాగంగ దువ్వుచు**

**కాన్పు చేయసాగె గరుణతోడ 35**

**ఆ.వె. బాష్ప జలము గార్చె భార్య బాధనుగాంచి**

**పేదతనము దలచి ఖేదమందె**

**దబ్బ పండు వంటి తనయుండు జన్మించ**

**ఘనము దల్చి వారు గర్వపడిరి 36**

**తే.గీ. శుభ సమయము గ్రహగతి శుభమటంచు**

**భోగ భాగ్యాల తులతూగు బిడ్డడనుచు**

**విప్ర వర్యులు పంచాంగ వప్రమరసి**

**నొక్కి పలుకంగ దంపతుల్ మ్రొక్కులిడిరి 37**

**<u>ధర్మదత్తుడు మహాపురుషుడగునని వేదవేత్తలు బల్కుట</u>**

**ఆ.వె. ప్రజల మేలు దలుచు పరిపూర్ణుడగునని**

**వేద పండితుండు విశదపరచ**

**ఊరు సంతసించె నుప్పొంగె నెంతయో**

**జనగణాళి జగతి మనసు విరిసె** **38**

**తే.గీ. బాలసారెను జరిపించె పల్లెయందు**

**ధర్మ పాలుని రూపును దాల్చి నట్టి**

**సుతుని యందమ్ము శ్లాఘించి శుభము లరయ**

**"ధర్మదత్తుండ" నెడిపేరు పేర్మి నిడియె** **39**

**<u>ధర్మదత్తుడు భారసాల సమయమున ఈశ్వర వరప్రసాదియని బల్కుట</u>**

**ఉ. వీనుల విందుగా నపుడు వెల్వడె నచ్చట శంఖనాదముస్**

**దానికి భక్తితో జనులు దండముపెట్టిరి శంకరాయనిస్**

**కానగ నెవ్వరుస్ గనుల కన్పడ కుండుట గొప్ప వింతయౌ**

**దానిని దైవలీలయని దల్చిరి వేంగిన పల్లెవాసులుస్** **40**

I



**శంఖ బంధము**

**కం.పావన మునిజన పాలా!**

**పావని బింబాధరార్ధ పాన విలోలా!**

**పావన నగచయ కైలా**

**సావాసా! నాగభూష! హస్తికచేలా!** **41**

**సీ. శ్రీపార్వతీ పతీ! శ్రీజగద్రక్షకా!**

**శ్రీచంద్రశేఖరా! చిద్విలాస!**

**కోపానలాంబకా! గురులింగ రూపకా!**

**గుణ గాన తోషకా! క్షోభ భంగ!**

**శ్రీపార్ధ పూజితా! శ్రీలోక నాయకా!**

**శ్రీరామ సేవితా! చిత్తవాస!**

**మాపాలి దేవరా! మాపాలి శంకరా!**

**మాంపాహి! మాంపాహి! మౌని వినుత!**

తే.గీ.  మమ్ము చూడంగ వచ్చితే మాన్యదివ్య

రూపమెత్తుచు కృపతోడ రుద్ర! భద్ర!

నీలకంఠ నమామి! మమ్మేలు కొనుమ!

నీదు దాసాది దాసులనాదుకొనుము. 42

తే.గీ.అనుచు ప్రార్థించు ధర్మపాలుని మొగమ్ము

మందహాసాంబుజాత  మరంద బిందు

శీకరావృతనేత్ర వశీకరణ ద

యార్థ  వీక్షణమ్ములగొని హర్షమ్ము గొని 43

తే.గీ. ధర్మదత్తుని గనుచు సద్ధర్మరతుడు

సత్య వాక్పాలకుండు సౌజన్య శీలి

నవసమాజ నిర్మాణ నిర్ణాయకుండు

జనన మందెన ననిపల్కె ఫణిధరుండు 44

తే.గీ. అటుల దృశ్యరూపమ్మున హరుడు మధుర

భాషణమ్ములు వచియించి బాలునెడద

కెత్తుకొని హత్తుకొని సేసలిడుచు శిరము

నిమురుచుస్ తల్లి దరిజేర్చి నెనరు జూపి. 45

వ. అదృశ్య రూపుధరుడైన శంకరుని పలుకులాలించిన పల్లెవాసులందరు సాక్షాత్

శంకరవర ప్రసాదియని భావించిరి. 46

## ధర్మదత్తుని శైశవ దశ

**ఉ. అందరి బిడ్డగా దలచి యాటల పాటల బెంచుచుండగన్**
**సుందర రూపునిన్ గనగ నోకును దిష్టని దల్చిపేదనన్**
**పొందిక దిష్టి దీయకను పోరడినీయదె, అందరందరున్**
**చందురుడంచుచున్ బొగడ చక్కగ నవ్వును ధర్మదత్తుడున్** **47**

**ఉ. బాలుని యందచందములు బాగని మెచ్చిరి వేంగియంతటన్**
**మేలిమి పైడియన్నటుల మెత్తని బుగ్గల ముద్దులాడుచున్**
**మాలిమి యయ్యెనందరికిం మామలె యత్తలె యెల్లవారలున్**
**పాలను స్తన్యమీయనని పల్కెడు తల్లిని గానమచ్చటన్** **48**

**తే.గీ. బోర్ల పడగాను పోసిరి భోగి పండ్లు**
**పాకినంతనె పెట్టిరి  పాయసమ్ము**
**దత్తు మోకాళ్ళ దోగాడ నెత్తుకొనుచు**
**అడుగు లేయగ మురిసిరి యచటి జనులు** **49**

**ఉ.కాలము రివ్వునన్ దిరిగె కానగ వేంగిన మార్పులేదులే!**
**బాలల పాఠశాలలును ప్రాణము నిల్పెడి వైద్యశాలయున్**
**మేలగు కార్యసాధనలు మేకొని జేయరు నాయకోత్తముల్**
**వాలుగ విత్తముంగొనెడు ప్రాభవ నైపుణి వారినైజమౌ!** **50**

## ధర్మదత్తుని విద్యాభ్యాసము

**శా. వేదాభ్యాసమె నిత్యవృత్తిగ, సదావేదాంత శాస్త్రార్థముల్**
**వాదార్థోపదగా, గృహస్థ విధులే రమ్యైక భాగ్యాలుగా**
**బోధాద్యాయమె దైవ సత్క్రియగ సమ్మోదమ్ముతో నెంచు భా**
**వోదారుల్ విధివంశజుల్ గలరు సత్యోపాసకప్రోన్నతుల్ 51**

**ఉ. వేరొక దారిలేదనుచు విప్రుల సన్నిధినుంచె పుత్రునిన్**
**వారును ధర్మదత్తునికి వైదిక విద్యలు శాస్త్ర విద్యలున్**
**గూరిమి నేర్ప దత్తుడు నకుందిత విలాస వైఖరిన్**
**నేరిచె నొక్కపెట్టున వినీతులదేకద వేదసంపదల్ 52**

**ఆ.వె. రాగ విద్యలివ్వి రాజలాంఛనునకు**
**సత్య ధర్మ నీతి సంగతమ్ము**
**వేదశాస్త్ర చయము వినయ స్వభావమ్ము**
**స్వార్థ రహిత బుద్ధి భద్రవాక్కు! 53**

**ఆ.వె. విప్రవర్యుల నుండి వేదమ్ము నేర్చెను**
**మల్లుర దరి నేర్చె మల్లవిద్య**
**రామకథలు జదివి రాగాత్ముడయ్యెను**
**భారతమ్ము జదివి వీరుడయ్యె 54**

**చంద్రవర్మ వృత్తము:**

**ధర్మశాస్త్ర విధి తత్త్వము నేర్చెన్**

**కర్మకాండ విధి కర్మలు నేర్చెన్**

**మర్మభావ గత మార్గము తోడన్**

**ధర్మదత్తుడొక జ్ఞానిగ దోచెన్**

**(ర,న,భ,య 1-7 యతి, ప్రాస ఉన్నది - అప్పకవీయము - క్రమ సంఖ్య 96) 55**

**తే.గీ. కూలి నాలిని జేయుచు కూడు తినుచు**

**దినము గడిపెడి బ్రతుకులు తెలియు మీకు**

**ధనము గలిగిన వారికే ధరణి విద్య**

**కష్ట నష్టాల నలుగుటె కర్షకుండు 56**

**వ. అని బదులిచ్చిన ధర్మపాలుని అనునయించి యూరి వారలు శంకరుని భాషణమ్ములను,**

**ధర్మదత్తుని విద్యావైదుష్యమును వివరించి. 57**

**మౌక్తికమాల వృత్తము: శంకరుడే తాను స్వయముగా ని**

**శ్శంకత తెల్పెన్ సుజనహితుండున్**

**బొంకని వాడున్ బ్రణుత గుణుండున్**

**వొంకముగా నింట బొలుచునంచున్**

**(భ,త,న,గ,గ 1-7 యతి, ప్రాస యున్నది - అప్పకవీయము క్రమ సంఖ్య 77) 58**

**కం. కొమరుని విద్యాబుద్ధులు**

**కొమరుని సాధుత్వ బుద్ధి, కొమరుని నీతిన్**

**గమనించి తల్లిదండ్రులు**

**తమమనసుల హాయిగొనిరి దైవబలమిదే! 59**

## అన్నపూర్ణ వడదెబ్బకు అస్వస్థతయై మరణించుట

తే.గీ. కాలమొకరీతి గడవదు గణన సేయ
దాని ధర్మమ్ము దానిదే తత్త్వమిదియె
దినము వారాలు ఋతువులు తిరుగునట్లు
దేహతత్త్వమ్ము గ్రహగతి తిరుగుచుండు 60

మ. చటులోద్యత్ ఖచరోగ్రమండల బృహత్సామ్రాజ్య భోగీంద్ర ధృత్
నిటలాక్షేక్షణ భీమ వహ్ని విశిఖా దేదీప్య భానుప్రభల్
జటిలంబై వసుధాంతరస్థితి జలోల్లాసమ్ము నుష్ణోగ్ర సం
కట సతప్తము చేయ ప్రాణిచయముల్ గాసిల్లె దాహార్తతస్ 61

తే.గీ. పంట పొలములు పడినట్టి పరిగ గింజ
లను వడిగ దెచ్చి వండి ముద్దలను జేయ
దలచి అన్నపూర్ణ వెడలె ధరణి తీక్ష్ణ
కాంతి లెక్కసేయక పరిగలను వెదుక 62

కం. కలగింపు నెండ తగులము
తలనొప్పిడ జెమట కార్చ దాహము పెంచస్
కలగుండు వడక ధారత
పొలమున పరిగలను పెద్ద మూటగ జేసెస్ 63
ఆ.వె. పాపమామె కపుడు వడదెబ్బ తగులంగ
తూలిపోయి నేల గూలబడియె
పల్లె వెజ్జు వచ్చె వైద్యమ్ము చేయంగ
నాల్క జూచె చేయి నాడి జూచె 64

**తే.గీ. పిచ్చి చూపులు జూచుచు పిలుపులేక**
**అన్నపూర్ణమ్మ భర్తను నినుగు సుతుని**
**చుట్టు నున్నట్టి మిత్రుల చుట్టములను**
**వారి వీరిని జూచి కన్నీరు విడిచి** **65**

**తే.గీ. చేతులూపుచు మ్రొక్కుచు శివుడు పిలిచె**
**నన్ను ననుచు చేతుల సైగ విన్నవించి**
**వోవుచుంటిని సుఖముగ దేవు నరయ**
**సెలవు సెలవంచు మలిమ్రొక్కు చేసెనపుడు** **66**

**ఉ. ఉన్నత శీలముస్ దలచి యూపిరి యాగిన పల్లెకాంతలుస్**
**మన్నన లందుచుస్ మహిళ మంచికి తోడ్పడు బుద్ధిదల్పుచుస్**
**పిన్నిగ దల్చిపిల్చితిమి పేర్మిగ నుంటిమి యింతకాలముస్**
**దన్నును కొలుపోతిమని దైన్యము నందిరి యంగనామణుల్** **67**

**తే.గీ. కన్న తల్లికి బట్టిన కర్మ గాంచి**
**ధర్మ దత్తుడు విలపించె తలచి తలచి**
**కర్మ కాండలు సలుపంగ కాసులేదు**
**జనుల సాయంబు తోడుత జరిగె తంతు.** **68**

**ఉ.తిండిని ముట్టకస్ దిరుగు తీరుకు జేరెను ధర్మపాలుడుస్**
**బండగ మారెనాతడును భగ్గున మండిన బాధతోడుగస్**
**గుండెల యందునస్ నిలిచి గూడును గట్టిన భార్యవీడగస్**
**పుండగు మేని యేరికిని బూనగ నింకను మానదెన్నడుస్!** **69**

## అన్నపూర్ణ చితాభస్మమును గంగలో కలుపుట

**వ. కర్మకాండల యనంతరము విప్రుండు అన్నపూర్ణ చితాభస్మమును,**

**శల్యములను జూపి 70**

**చం. సుగతికి అన్నపూర్ణ జను సుస్వరముస్ బలుకంగ దీవెనస్,**

**తగిన విధంబు దెల్పగను తప్పక యంచును వారలిద్దరుస్**

**దిగులును మ్రింగి సాగిరి నదీతటముల్దిరుగాడి రంతటస్**

**మిగిలిన సొమ్ముతో జనిరి మీరిన శ్రద్ధగ వారణాసికిస్ 71**

**వ. కాశీ క్షేత్రముంజేరి ధర్మపాలుడిట్లు విలపించసాగెను 72**

**తే.గీ.గంగ తీరంబు జేరిరి కనుల నీట**

**అన్న పూర్ణగ పేరున్న అమ్మ నీవు!**

**మాకు తోడును విడదీయ మర్మమేమి?**

**జీవితంబులు మోడయె చినిగె బ్రతుకు 73**

**తే.గీ.ధర్మదత్తుడు ధరణిని తల్లి లేక**

**బతుకు నీడ్చెడి కర్మంబు బాధ గాదె!**

**వాని లాలన పాలన పైన మేమి?**

**దిక్కు దూరము జేసిన దేవుడనుచు 74**

**ఉ. కన్నుల వెల్లువై నుబికె గాల్వలు గట్టెను బాష్పమంతటన్**

**పెన్నిధి గోలుపోతిమని పెద్దగ నేడ్చిరి గంగసాక్షిగా**

**సన్నని రోదనల్ చెలగ శల్యములన్ బసుమమ్ము గంగలో**

**తిన్నగ భక్తిమై కలిపి దీనత శంకరు జూడ వెళ్ళగన్** **75**

**వ. అనంతరము విశ్వేశ్వరుని దర్శించి ధర్మపాలుండు తన పుత్ర సహితుడై**

**తన యూరికి బయనమయ్యెను.** **76**

## <u>ఆశ్వాసాంత పద్యములు</u>

**కం. హరునకు భవహరునకు కుం**

**జరవర వాంఛానుమేయ చర్మధరునకున్**

**వరదునకున్ భక్తి వశం**

**కరునకు శంకరునకు శుభకరునకు జేజే!** **77**

**కం. కాశీ విశ్వేశ్వరునకు**

**శ్రీశైల పురాధివాయులింగ ధరునకున్**

**శ్రీశైల రాజతనయా**

**వైశిష్ట్య మనోధిరాజ్య పాలకు జేజే!** **78**

**ఆశ్వాసాంత గద్యము:** **ఇది శ్రీవాధూలస గోత్రపవిత్ర టేకుమళ్ళ హనుమాయమ్మా సుబ్రహ్మణ్యాఖ్య చతుర్థ పుత్ర, సహృదయ, కవిమిత్ర, శ్రీపరమాత్మ గురుకటాక్షవీక్షణాలబ్ధ సారస్వతమర్మ వేంకటప్పయ్యశర్మ ప్రణీతంబైన ధర్మదత్తోదయంబను ప్రబంధంబునం ద్వితీయాశ్వాసంబు సమాప్తము.**

**-0o0-**

# తృతీయాశ్వాసము

## ధర్మదత్తుడు తల్లిని గూర్చి దు:ఖించుట

**కం.శ్రీవారణాసి వాసా!**

**ప్రోవగ వెలసిన శివుడవు పూనిక తోడన్**

**జీవుల బాధల నెఱిగియు**

**కావగ లేవా? ప్రజలను కష్టములందున్** 1

**ఉ. అమ్మను కోలుపోతినిక నాకలి దీర్చెడి వారలెవ్వరో!**

**ఇమ్ముగ బుజ్జగించి సహిష్ణుత గూర్చెడి తల్లిలేదయా!**

**కమ్మని మాటలన్ హృదయ కష్టము మాన్పెడు మాతలేదయా!**

**నమ్మిన వారకెల్లరకు నష్టము చేయుట పాడిగాదయా!** 2

**వ. అని తలపోయుచు, మిక్కిలి బాధనొందుచు, ధర్మదత్తుడు నిద్రపట్టక రాత్రి రైలుబండి**

**యందు పరిపరి విధముల దు:ఖించుచు** 3

**ఆ.వె. నాన్న పాద మంటి మన్నన నందించి**

**తప్పు గావు మనుచు రెప్పలార్చి**

**జీవితమున జనుల జీవిక బాగుకై**

**గొప్ప వాడి నగుట తప్పదనుచు** 4

**తే.గీ. పల్లె పట్టుల నుండిన బ్రతుకు లెండు**

**పరిగ నేరుచు బ్రతికెడి పథము వలదు**

**గొప్ప వ్యాపార మార్గంబు గోరిద్రొక్క**

**జీవితంబున సుఖమగు చింత దొలగు** 5

ఉ. అర్ధము ధర్మ మార్గమున నందగ బూనిన ఉత్తమంబగుస్
వ్యర్థపు సంపదల్ మరిగి వ్యాకుల మందగ చిత్తమొప్పునా?
ఆర్థిక బాధలస్ దొలగ నాగుసె కోర్కెలు మానవాళికిస్
అర్థము నందగా జనులు వ్యర్ధపు బర్వులు సేయ ధర్మమా? 6

<u>నడిరేయి మార్గ మధ్యమున బలార్షాలో రైలుబండి దిగుట</u>

వ. నడిరేయి రైలుబండి బలార్షా స్టేషను యందు నాగగా 7

ఆ.వె. బండి దిగెను తాను మండిన గుండెతో
తండ్రి నిదుర నుండ తప్ప కపుడు
కనుల నీరు నిండి కారగ ధారగా
అదుపు జేసి కొనుచు నాతడంత 8

వ. అయ్యర్ధరాత్రంబున స్టేషను నందలి బండలపై నిదురించి, తెల్లవారగనే
బయటకు రాగా ఒక పెద్ద సంత కనిపించెను. 9

ఉ. తెల్లగ తెల్లవారెనట దిక్కులు పిక్కటిలంగ సంద్రముల్
వెల్లువ పోటునస్ జెలగు రీతిగ వేలము పెట్టికేకలస్
చిల్లువడంగ వీనులటు చెప్పెడి వారల గోలదల్చుచుస్
అల్లన వచ్చి నిల్చె మది నచ్చెరువందగ వింతగానగస్ 10

**తే.గీ. సంత కేకల వినుచును సందు తిరుగ**

**కడుపు టాకలి మంటలు ఘనము దోచె**

**చిల్లి గవ్వయు లేదాయె చేతిలోన**

**ఆకలేరీతి తీరునో యనుచు నడచి** 11

## క్షుద్బాధను తీర్చుకొనుటకు సత్రమున కరుగు సమయమున ప్రమాదము జరుగుట

**ఆ.వె. సందు మలుపు లోన సత్రంబు గలదని**

**బాట సారి చెప్ప బయలుదేరె**

**అంతలోన కారు హతవిధీ! ఆగక**

**గుద్దు కొనగ పెద్ద సద్దు జేసె!** 12

**ఆ.వె.కనులు తిరిగి కూల, కారెను ధారలై**

**రక్తమంత నేల సిక్త మాయె**

**దిమ్మ తిరిగి పడిన తీరును జూచిన**

**బండి నడుపు వాని గుండెలదిరె** 13

**ఉ. మూగిరి రోడ్డుపై జనులు మున్నుగ తప్పును నెట్టి కారుపై**

**ఆగని గుండె చప్పుడుకు ఆగము జేసెడి వారిగాంచుచున్**

**దాగెను కారులో నతడు తల్పుల దీయకె నిల్చెనంతటన్**

**వేగిర పాటుతో నటకు వెన్కనె వచ్చిరి రక్షకాధిపుల్** 14

**తే.గీ. అద్ది గద! జనరక్షణార్యవరుల పని**

**ఎవరికేదైన జరిగిన నెటుల నున్న**

**వారి రక్షింప వచ్చెడి ప్రాథమికపు**

**జర్య దలప వారే సమాజ హితవరులు. 15**

**ఆ.వె. వారు లేక యున్న ధారుణీ తలమున**

**శాంతి యేది న్యాయ కాంతి యేది?**

**కాని, వారి వైపు కారుణ్య భావాన**

**చూచు ప్రభుత యేది? ప్రోచునేది? 16**

**కం. ఉద్యోగ సంఘమందున**

**ఖద్యోతులు వీరెసుమ్ము కానీ బ్రతుకుల్**

**చోద్యము జీతము తక్కువ**

**సాధ్యము గానట్టి పనులు సలుపగ వలయుస్ 17**

**<u>రక్షకభటులు ధర్మదత్తుని వైద్యశాలకు తీసుకొని వెళ్ళుట</u>**

**ఉ. బాలుని వైద్యశాలకును బ్రాణము నిల్పగ వేగిరమ్మునస్**

**తోలిరి మూగియాగినటు త్రోవకు నడ్డగు పాదచారులస్**

**జాలిదలిర్ప బాలుగని సత్వరమట్టుల వాహనమ్మునస్**

**వైళమ వానిగొంచుమొగి పర్వులు దీసిరి వెజ్జుజూడగస్ 18**

## వైద్యుల ఘనతను శ్లాఘించుట

**కం.ధరణిస్ దేవతలెవ్వరు?**

**పౌరిప్రాణము రక్షణసేయు పూతాత్ములు, సా**

**ర రసార్ద్ర చిత్తులు సహన**

**పరులు విబుధ మాన్యులు మన వైద్యులె సుమ్మీ 19**

**కం. ఋణదాత వైద్య వరుడును**

**అనువుగ ప్రవహించు నదియు నవనీసురుడుస్**

**మనియెడు చోట వసించుట**

**మనుజుని గతజన్మ పుణ్యమహిమయె గాదే! 20**

## ఆసుపత్రికి గోవింద కర్వడే యేతెంచి బాలుని ప్రాణములు కాపాడమని ధనమిచ్చుట

**ఆ.వె. ఆసుపత్రిలోని ఆఫీసు జనమెల్ల**

**వచ్చినట్టి వ్యక్తి వంకజూచి**

**కోట్ల ధనము గలుగు గోవింద కర్వడే**

**వచ్చెననుచు వచ్చె ననుచు భ్రాంతి పడిరి వారు 21**

**(కర్వడే అనునది మహారాష్ట్రలోని ఒక సనాతన బ్రాహ్మణ వంశము)**

**ఆ.వె. భ్రాంతి కాదతండు భద్ర సంపన్నుండు**

**తనదు కారు వలన ధరణి బడిన**

**బాలు గాంచి వాని వైద్యంపు ఖర్చుకై**

**వచ్చినట్టి సత్య వర్తనుండు. 22**

**తే.గీ. ముఖ్య వైద్యుండు దిగివచ్చి మోకరిల్లి**

**కార్యమేమని ప్రార్థించె కరములెత్తి**

**బాలు గాపాడు బాధ్యత పడయుమనుచు**

**చెక్కు చేవ్రాలు మాత్రమే చేసి యిచ్చె 23**

**వ. గోవింద కర్వడేతో మాప్రాణములొడ్డి కాపాడెదమని చెప్పి సాగనంపి,**

**ఆ వైద్యుడు తన వారితో 24**

**ఉ. బాలుని శ్రద్ధగా గనెడు పద్ధతులన్నియు బోధజేయుచున్**

**కూలును గొప్పపేరుమరి కూడని మందుల నీయరాదయా!**

**వీలగు మంచిమందులను వెంటనె వాడుడు జాగుచేయకన్**

**మేలగు వైద్యశాల గని మెత్తురు పెద్దలు సంఘమందునన్. 25**

**తే.గీ. గంట గంటకు బాలుని గాంచు చుండి**

**వెంట వెంటనె వైద్యమ్ము వేగ పరచి**

**బాలు కాపాడి రందరు బాధ్యతెరిగి**

**కనులు తెరిచిన బాలుని కాంచిరంత. 26**

**<u>బాలుని స్వస్థత యనంతరము గోవింద కర్వడే ఆసుపత్రికి వచ్చుట</u>**

**వ. విషయ మరసిన గోవింద కర్వడే ఆసుపత్రికి నేతెంచెను. 27**

**కం. బాలుండు కన్నులు దెరచుచు**

**వాలుగ నాస్పత్రి వారి పరికింపంగన్**

**వైళమ గోవిందు దరికి**

**వాలుచు నీవార్త తెలుప వడినాతండున్ 28**

**కం. వడివడి యడుగులు వేయుచు**

**తడబడుచుస్ పరుగులిడుచు తత్తర పడుచుస్**

**కడుకొని బాలుని చూడగ**

**నెడంద దడదడ వేయ నేతెంచె తృటిస్ 29**

## ధర్మ దత్తుని సౌందర్యమునకు గోవింద కర్ణడే ముగ్ధుడైన విధానము

**ఆ.వె. వాని దేహ పటిమ వాని రూపోన్నతి**

**వాని ధీర గుణము వాని సౌరు**

**వాని వినయ భూతి వాని వర్ణఛ్చాయ**

**వాని కనుల కాంతి మేను చూచి 30**

**శా.ధాత్రు వినోదలీల! బురదన్నొన్నత్య భావస్ఫురత్**

**సారోదీర్ణ పరిమళాంచిత లసత్పద్మమ్ము బుట్టించుచూ**

**పారం జేసెడునట్టి లీబుడుత దా బర్యావలోకాన నా**

**మారుస్ గెల్చెడు నందచందముల జన్మంబిచ్చె బేదింటహో! 31**

**తే.గీ. వీని జూడగ నెమ్మది లోన నేదొ**

**రాగభావమ్ము పుట్టె! నేప్రాంతమందు**

**వాసమో? ఇటుకేలదా వచ్చె? నేమి**

**పనియొ? పేరేమొ? అడిగెద యని తలంచి. 32**

**వ. అని వాని చెంతకు వెడలి - వానింజూచి 33**

## ధర్మదత్తుడు తనను గురించి తెలియజేయుట

తే.గీ. ఎద్ది నీపేరు? తలిదండ్రులెవరు నీకు?

తెలియ జెప్పుము నాకని పలుక – వాడు

"ధర్మ దత్తుండు నా పేరు తల్లిలేదు

వేంగి ప్రాంతంబు నాదని" వివరమిచ్చె 34

చ. చదివితి ధర్మ సూక్ష్మములు చక్కగ వేద పురాణ శాస్త్రముల్

చదివితి మాన్య సత్కథలు సభ్యసమాజము దానిపోకడల్

చదివితి మంచిచెడ్డలు విలాస వినోద విహార సాహితీ

సుధలిడు నవ్యగాధలను జొక్కితి నాత్మవిశేష తృప్తితో 35

ఆ.వె. కాని యేమి సేతు కరవు ప్రాంతము నందు

పేద వాని యింట ప్రేమ లేక

పుట్టువిచ్చె బ్రహ్మ - పొడవదు మాయింట

ప్రొద్దు - సతము తమము ముద్దులాడు 36

తే.గీ.తల్లిదండ్రులిరువురు మేనెల్ల వంచి

కూలి నాలి చేయుచు నాకు కూడు గుడ్డ

లందజేసి చదువు సాము లమర జేసి

రయ్య! పెద్దయ్య! వందన మయ్య మీకు! 37

ఆ.వె. నన్ను గన్న తల్లి అన్నపూర్ణాదేవి

నాదు వృద్ధి చూచు నవ్య చరిత

కన్ను మూసె - నాన్న కడలేని దు:ఖాబ్ధి

ముంచె - కస్తి కడలి ముంచె నన్ను. 38

## గోవింద కర్వడే ధర్మదత్తుని దత్తత తీసుకొనదలచి భార్య అహల్యాబాయికి చరవాణిలో చెప్పుట

వ.గోవింద కర్వడే వానిమాటలకు ఆలోచనా నిమగ్నుడై, చరవాణిలో భార్య అహల్యాబాయితో
నిట్లు చెప్పదొడంగెను. 39

తే.గీ. వినుమహల్య! నెమ్మది తోడ, పేడ్క మీర
నేను చెప్పెడి విషయమ్ము నీకు ప్రియము,
శాంతి సంపద లందించు, జింత మాన్పు,
నింటి గౌరవమ్మును పెంచునే - లతాంగి! 40

ఉ. కాంచితి ధర్మవీరునిట, కాంచితి సుందర రూపునిచ్చటన్
కాంచన దేహమాతనిది, కారణ జన్ముడు ధర్మదత్తుడున్
కాంచగ వంశగౌరవము గాచెడి బాలుడు వారసుండనన్
పంచును మంచినెల్లడల పాపము పుణ్యము నెంచునేతయౌ. 41

ఆ.వె. అనగ వినిన భార్య నరుదెంచె నప్పుడే
బాలు గాంచి తాను పరవశించి
బెంగ వలదు తండ్రి బెంబేలు వలదింక
అన్ని నీకు మేమె అమ్మ నాన్న. 42

## దత్తత  విషయము విని ధర్మదత్తుడు కృతజ్ఞత తెలియజేయుట

ఉ. పాదములంటి వారికిని బాధగ నేడ్చెను గుక్కపెట్టుచున్
వేదన దీరి సంతసము విచ్చెను వంశపు వృద్ధి దల్చుచున్
మోదమునందె వారలును ముద్దుల బాలుని దత్తతందగన్
వేదము నమ్మువారలకు వేదన లుండునె యిజ్జగంబునన్? 43

సీ.గోవింద కర్ణడే కోరిక మేరకు

పురమునందున్నట్టి  పౌరహితులు,

వేదవేత్తలు చేరి వేదఘోషల మధ్య

దత్తత కార్యంబు తగిన రీతి

జరిపిరి ఘనముగ శాస్త్రవిధిగ

ఉత్తరాయణమందు ఉపనయనంబును

జరిపించి సంస్కార సంపన్ను జేసిరి

యజ్ఞోపవీత విన్యస్త ఫణితి.

తే.గీ. దైవ మహిమగ జరిగెను దత్తతనుచు

"బిడ్డ లేనట్టి గొడ్రాలు" పిలుపు మాసె

ననెడి ఆనంద వీచిక లచట విరిసె

వేద వేత్తలు వారి దీవించి రెలమి. 44

సుగంధి వృత్తము : దైవలీల చిరమౌను ధర్మదత్తుడిట్టులీ

కోవ కర్ణడే ధనాఢ్యు కూర్మి పుత్రుడై మనెస్

శ్రీవసుంధరాధిపుండు సేవకుండు కాగ నా

సేవకుండు భూపుడౌను శ్రీమహేశు దృష్టులస్

(ర,జ,ర,జ,ర, 1-9 యతి, ప్రాస ఉన్నది- అప్పకవీయము క్ర.సం.126) 45

ఉ. కన్నుల నీరునిండగను కాళ్ళకు మ్రొక్కుచు వారికప్పుడుస్

దన్నుగ నిల్చితీరుమరి దత్తత గైకొని పేదవానినిస్

మిన్నగ మీదు వంశమును మించిన దీక్షగ గాచినిల్చెదస్

పెన్నిధి మీరునాకనుచు పెద్దగనేడ్చెను ధర్మదత్తుడుస్ 46

**ఆ.వె. ఆంగ్లవిద్య యందు అందరినోడించె**

**గణిత విద్య యందు ఘనత బొందె**

**సర్వ శాస్త్ర గతులసరిసాటి లేడని**

**వరుస నుతులనిడిరి గురువులెల్ల** 47

**ఆ.వె. సర్వ జీవులందు సౌజన్య మూర్తిగా**

**పట్టణమ్ము నందు ప్రతిభ పెరిగె**

**గౌరవమ్ము బెంచు ఘనుడని గోవిందు**

**పొంగిపోయె మదిని మురిసిపోయె** 48

**<u>తండ్రి గోవింద కర్వడే వ్యాపార విషయములలో సహాయపడి పేరు తెచ్చుకొనుట</u>**

**సీ. వార్ధక్య భారమ్ము వారిని తాకగా**

**గోవింద కర్వడే కొంత క్రుంగె**

**తండ్రికి తోడుగా దక్షత తోడను**

**వ్యాపార విషయాల పద్దు నేర్చె**

**సర్వ కార్యములందు చతురత స్ఫూర్తితో**

**మేటిగ నిలుచుచు మెప్పునందె**

**ఆబాల గోపాల మచిర కాలము నందె**

**పంక్తిలో ఘనుడను వాసికెక్కె**

**తే.గీ. నగర వాణిజ్య సంఘంబు నాయకుడుగ**

**దేశ సంబంధ బాంధవ్య దిశలనెరిగె**

**వసుధ గోవింద కర్వడే వారసుండు**

**యోగ్యుడని జనుల్ మెచ్చునట్లొప్పె నచట** 49

## ధర్మదత్తుని యుక్త వయస్కుడగుటచే వివాహ ప్రస్తావన

**తే.గీ.కోర మీసాల కుఱ్ఱాడి గుణ వితతికి**

**మన్మథాకార పుష్టికి మనసు కదల**

**పంచ బాణుని శరముల వాడి వేడి**

**కల్లలాడిరి యువతులు కాంచి వాని 50**

**తే.గీ. ధర్మ దత్తునిఘన సౌమ్య ధనగుణమ్ము**

**తెలిసి వ్యాపారవేత్తలు దేశదేశ**

**ములను దాటి వచ్చిరి తమ ముద్దు కూతు**

**నీయగా బంధుతా బంధ మేర్పడంగ 51**

**వంశస్థ వృత్తము: ఘనాఘనోద్దీపిత గాత్ర శోభితుస్**

**మనోనుకూలాంచిత మన్మదాధిపుస్**

**వినీత వర్తుస్ సువివేక ధామునిస్**

**గనుంగ వస్ గాంచి ఘనాత్మ మెచ్చుచుస్**

**(జ,త,జ,ర, 1-8 యతి, ప్రాస ఉన్నది. అప్పకవీయం -క్ర.సం. 87) 52**

## ధర్మదత్తుని కులగోత్ర ప్రస్తావన వచ్చుటచే కర్ణుడే ఆగ్రహించుట

**ఆ.వె. అడిగిరిట్లు వారలా తల్లిదండ్రులస్**

**వింటిమేము మీర లింటివార**

**సునిగ స్వీకరించి రనుచు నిద్ది నిజమా?**

**ఐన నితని కులము గుణాంకమేది? 53**

**కం. వారల మాటకు గోవిం**

**దురోష కలితుండయి తగదు రొకో మీరల్**

**మారాడక పొండు నతులు**

**శ్రీరామ సముండు ధర్మ చిత్తుడు వీడా! 54**

**వ.వారు వెడలి పోగా 55**

**తల్లి ధర్మదత్తుని మనసు నెరింగి వివాహ విషయము నడుగుట**

**తే.గీ. చిన్ని నవ్వులు నవ్వుచు సిగ్గు పడుచు**

**ధర్మ దత్తుండు దిక్కులు ధరణి జూడ**

**తల్లి మనసుకు చిక్కని తనయుడెవడు?**

**పిలిచి యడుగంగ తనకోర్కె తెలిపె నిట్లు 56**

**కం. అమ్మా! బ్రాహ్మణ కన్యను**

**తెమ్మా! యింటికి వెలుగును తెచ్చెడి వనితన్**

**నెమ్మది మిము సేవించుచు**

**సమ్మానించెదము సతము సత్యము తల్లీ! 57**

**వ. అని ధర్ముడు పలుకంగ అహల్యాబాయి లోకోద్ధారకుడైన వానిని పుత్రునిగా జేసినందులకు భగవంతునికి నమస్కరించి భర్త గోవింద కర్ణడేను సంప్రదించి 58**

## అహల్యాబాయి కుమారుని వివాహమునకు పూనుకొనుట

**తే.గీ. వాడ వాడల గాలించి పైన మెరిగి**

**పేదరాలైన గుణముల పేటికైన**

**కన్య నొకరిత గాంచి తక్షణమె మెచ్చి**

**వనిత చిత్రమ్ము గొని వచ్చి పతికి జూపె. 59**

**కం. గోవింద యయ్యువతి స**

**ల్లావణ్యము గాంచి మెచ్చి లాలన తోడన్**

**రావయ్య! దత్త! చూడుమ**

**యీవనిత పటమ్ము హృద్రసేక్షణ తోడన్ 60**

**వ. ఆ అమ్మయి పేరు అంకితాదేవి యని తల్లి అహల్యాదేవి చెప్పగా 61**

**కం. చిరునగవు సిగ్గు దొంతర**

**వరుసగ రాన్ బటము గొంచు పరి పరి గతుల**

**న్నరసెను నెమ్మది క్రొవ్విరి**

**విరియగ దత్తుండు ప్రేమ వీక్షణ తోడన్ 62**

## వివాహ సమయమున దండ్రి ధర్మపాలునికై కబురంపుట

**వ.అదే సమయంబున తన కన్న తండ్రి ధర్మపాలుడు గుర్తునకు వచ్చి 63**

**తే.గీ.వేంగి పల్లియ వెదికించె వేగు నంపి**

**ధర్మ దత్తుండు వాడట్లు తరలి వెదకి**

**అతడు మరణించె ననువార్త నాలకించి**

**వచ్చి తద్వార్త తెలిపె పెన్వగపు తోడ 64**

**శా. అమ్మాటల్ విని ధర్మదత్తుడు వగస్ హా! తండ్రి! క్షంతవ్యుడస్**

**మిమ్ముస్ మీ యనురాగ బంధమును మీ మేలైన వాక్యమ్ముల**

**నమ్మాలస్ బడపైచి మిమ్ము విడి నే స్వార్థప్రభాకర్ష భూ**

**తమ్ముంజిక్కిటు వచ్చితిస్ మిమ్ము సదాత్మస్ భావన జేయుచుస్** **65**

**ఆ.వె. జనని దూరమయ్యె జనకుండు సతిజూడ**

**స్వర్గసీమ జేరె వసుధ యందు**

**నేనొ యొంట రైతినే దైవమా! యిటు**

**లండ లేక పోయె నంచు వగవ** **66**

**కన్న తండ్రి ధర్మపాలుని మరణవార్త విని కర్ణడే దత్తునోదార్చుట**

**ఆ.వె. కన్న తండ్రి వార్త కర్ణడే కనుగొని**

**పుట్టు వార లెల్ల గిట్టు ననుచు**

**ఇద్ది ధర్మ మనుచు నిలలోన దెలిసిన**

**వేద మెరిగినట్టి విదుడ వీవు** **67**

**వ. అనుచు పరిపరి విధముల నోదార్చెను.** **68**

**ఆ.వె. అటుల కొంతకాల మట్లేగ నొకనాడు**

**దత్తు గాంచి తల్లిదండ్రులెలమి**

**పెళ్ళిమాట నెత్తి పెనుభక్తి వారల**

**పదములంటి వాడు వల్లె యనియె.** **69**

**తే.గీ. పేదరాలిని గోరెడు పిచ్చి దనుచు**

**కోరి వచ్చెడి కోట్లను కూడదనెడి**

**తల్లి లోకంబు గలదొకో తరచి చూడ**

**పలుకు వారల మాటలు పట్టనట్టు 70**

**ఆ.వె. పేద వారె గొప్ప పేర్మిని బంచెడి**

**మంచి వారలనెడి మంది మాట**

**వినగ వలయు ననుచు వివరణ నిచ్చుచు**

**దేవ దేవు నమ్మి తీర్పు జెప్పె 71**

**<u>ధర్మదత్తుని పెండ్లి చూపుల ఘట్టము</u>**

**వ.దత్తుడు తల్లి దండ్రులతో గలిసి అంకితాబాయిని జూచుటకు వారింటికి వచ్చెను.**

**అప్పుడు పెద్దల యెదుట వరినొకరినొకరు చూచుకొనిరి. అపుడు 72**

**మ. కనియెన్నంకిత చంద్రమండల ముఖుస్ గంభీర మేఘస్ఫురత్**

**స్వన కంఠుస్ సరసాబ్జ నేత్ర విలసత్ భద్రాధి రూఢాప్త దే**

**హుని కల్యాణ గుణాభిరాముని సుకార్యోదీర్ణ సంభావనా**

**త్ముని సద్ధర్మ పదాను వర్తనుని సత్యోత్కంఠునిస్ దత్తునిస్ 73**

**వ. అటులనే ధర్మదత్తుడు కూడా 74**

**మ. కనియెన్ దత్తుడు చంద్రమండల ముఖిన్ కల్యాణ భావైక రా**

**గ నిధిన్ సుందర కంబుకంఠిని బృహత్ గందేభ కుంభస్తనిన్**

**ప్రణుతాంభోజ దళాయ తాక్షిని లసత్ లక్ష్మీ కళోద్భాసినిన్**

**వనితా లోక నుతాప్త ధర్మ చరితన్ భద్రోరు శీలాంకితన్ 75**

**ఆ.వె. యువకు వాడి చూపు యువతి వాల్చూపులు**

**నొకరి నొకరి దాక నోర్వగలదె?**

**మనసు తనువు భావ మధురిమ లెగయగ**

**వయసు లట్లు చేయ పడచులందు. 76**

**చం. అదియును గాక కట్టెదుట అందము చిందెడు మూర్తిమత్వమున్**

**పదిలము గొన్న యౌవన విమాన విహారము వాడి చూపులున్**

**గుది గొని గ్రుచ్చుచుండ నెఱి గూర్చెడు పంచశరుండు బాణముల్**

**వదలక వేయుచుండ మది పాడదె మోహన రాగ గీతికల్ 77**

**<u>ధర్మదత్తుని వివాహ ఘట్టము</u>**

**సీ. కొమరుని గుణమెంచి గోవింద కర్థదే**

**మురిసెను మనసంత ముదము నిండ**

**కల్యాణ ఘడియన కమనీయ రీతిలో**

**అంగరంగపుశోభ అమరె నచట**

**ఆదరించిరంత ఆహ్వాన యతిథుల**

**ధర్మ దత్తుని శోభ ధరణి మించె**

**అంకిత-ధర్ముల అన్యోన్య జంటపై**

**అక్షతల్ జల్లిరి ఆదరమున**

**ఆ.వె. తల్లి దిష్టిని తీయుచు తనయు గాంచి**

**కులము నిల్పెడు వానిని గుణము గలిగి**

**మనుమ నిమ్మని కోరెను మమత తోడ**

**జనులు ఆశీస్సు లిచ్చుచు జల్లె సేస** **78**

**వ. క్రొత్త దంపతులిరువురు వివాహానంతరము శ్రీసత్యనారాయణ స్వామి వ్రతమాచరించి, యీవిధంబున ప్రార్థించిరి.**

**79**

**<u>ఆశ్వాసాంత పద్యములు</u>**

**సీ. శ్రీసత్య రూపాయ! శ్రీసత్య నాథాయ!**

**శ్రీసత్య పాదాయ! సత్య దేవ!**

**శ్రీ సత్య మేధాయ! శ్రీ  సత్యధీశాయ!**

**సత్య సద్భావాయ సత్య దీప్త!**

**శ్రీ సత్య వాక్యాయ! శ్రీ సత్య కమలాయ!**

**సత్యాధి రాజాయ! సత్య ధర్మ!**

**శ్రీ సత్యమోహాయ! శ్రీ సత్య సింహాయ!**

**సత్య సంవృత్తాయ! సత్య గుప్త!**

**తే.గీ.మూలతో బ్రహ్మ రూపాయ! ముఖ్య రూప!**

**మధ్య భాగ మహేశాయ! మాన్య రూప!**

**విష్ణురూపాయ! వాక్యాయ! విష్ణు తేజ!**

**శ్రీ త్రయీ రమ్య రూపాయ చిద్విలాస!** **80**

**ఆశ్వాసాంత గద్యము: ఇది శ్రీవాధూలస గోత్రపవిత్ర టేకుమళ్ళ హనుమాయమ్మా సుబ్రహ్మణ్యాఖ్య చతుర్థ పుత్ర, సహృదయ, కవిమిత్ర, శ్రీ పరమాత్మ గురుకటాక్షవీక్షణాలబ్ధ సారస్వతమర్మ వేంకటప్పయ్యశర్మ ప్రణీతంబైన ధర్మదత్తోదయంబను ప్రబంధంబున తృతీయాశ్వాసంబు సమాప్తము.**

**-o0o-**

# చతుర్థాశ్వాసము

**కం. శ్రీమాధవ! మధుసూదన!**

**నామదిలోబూర్ణ భక్తి నమ్మిక తోడన్**

**ఏమరకను సన్నుతించెద**

**పావన భావాళులిడుమ భర్తార్ధ కృదిన్ 1**

## ధర్మదత్తుని భార్య అంకిత అంకితభావముతో అత్తమామల సేవించుట

**వ. ధర్మదత్తుని భార్య అంకితాబాయి సుగుణము లెట్టివనిన 2**

**సీ. అత్తమామల హృదయాంతర భావాల**

**కనువుగా మెలుగుచు పనులు చేయు**

**పెనిమిటి సేవలే పెన్నిధిగానెంచి**

**శ్రద్ధ తోడుత పరిచర్య చేయు**

**దాన ధర్మములందు దాక్షిణ్యమున్ జూపి**

**పూత చిత్తన గోపూజ చేయు**

**సేవక గణముల సేమమ్ము నరయుచు**

**అర్హతా కార్యములంద జేయు**

**తే.గీ.అత్తమామల కమ్మగా నగుచు, పతికి**

**తగిన ఇల్లాలుగ మనుచు, తలపులందు**

**వంశ సంస్కృతి నింపి తద్వర్తనమ్ము**

**సలుపు లక్ష్మిగా నిల్చె వలపు పంచె 3**

**ఆ.వె.కాసులాస పడక కమల ప్రియం దెచ్చె**

**నింటి కోడటికము నిచ్చి తనదు**

**బిడ్డనోలె జూచె ప్రేముడి పెంపార**

**ననుచు నూరి వార లహల్య గాంచి 4**

**తే.గీ.పలుకు చుండగ విని మది పరవశించి**

**యేను నొక యింటి బిడ్డనే - యీాడు వచ్చి**

**యిటుల కోడలనైతిని - యిదియె ధర్మ**

**మాత్మ సుతయె కోడలు నాకంచు మురిసి 5**

**కం. మాయింటి దివ్వె వెలుగగ**

**మాయింటికి వచ్చినట్టి మహిళను మేమున్**

**మా యీాడుగ గనవలదా**

**రాయిడుటల్ భావ్యమగున రాతిరి పగలున్ 6**

**చం.అని తన యాత్మనందున నహల్య తలంచి యింటికోడలిన్**

**కనుగవ ప్రేమ నింపి తనకంటికి రెప్పగ జూచుచుండెన**

**ప్పెను లలిజూచి యంకితయు పేమరు భావన చేసె నేను భా**

**గ్యనిధిని అత్తమామలిటు లమ్మగ నాన్నగ నుండి రెప్పుడున్ 7**

**<u>అంకిత గర్భంబు దల్చుట</u>**

**అశ్వగతి: కుంకుమ ధారిణి గౌరి సుకోమల దేహధరన్**

**పొంకకుంగా బతిశక్తి విభూషణ వర్జితమౌ**

**నుంకువ గర్భము దాల్చెడి నున్నత శోభిత భా**

**వాంకిత గా నొనరించగ నంకిత సిగ్గు పడెన్ 8**

**(భ,భ,భ,భ,భ,గ - ప్రాస యున్నది యతి 1-10 అప్పకవీయం క్ర.సం. 138)**

**ఆ.వె.మట్టిగోడలందు చుట్టుముట్టి పలుకు,**

**పుల్లనైన కాయ, ఉల్లమలర**

**తినగనెంచె వాని తెమ్మంచు బతిగోరె**

**సిగ్గు దెశలు నిండ స్నిగ్ధ బుద్ధి** **9**

**ఉ.సుందర దేవతా మృదుల శోభిత విగ్రహముల్, లసత్కళా**

**బంధుర కాంచన స్థగిత భద్ర మనోహర రూప రేఖదృక్**

**వందిత విగ్రహావళుల పంక్తులుగా గదినిండ బెట్టె తా**

**నందగ నట్టి సంతు సుగుణాన్విత సుందర గాత్ర వంతులన్** **10**

**తే.గీ. ఇద్ది మన పూర్వ జనుల సమీక్షణమ్ము**

**గర్భవతి చిత్తమెపుడు గనగ వలయు**

**సత్యధర్మైక మూర్తుల సరస మతుల**

**రమ్య చిత్రమ్ములా నంద రాగ ఫణతి** **11**

**<u>అంకిత ఇద్దరు మగ బిడ్డలకు జన్మమిచ్చుట</u>**

**ఉ. పూచిన పూర్వ పుణ్యమున పుట్టిరి యిద్దరు బిడ్డలామెకున్**

**చూచిన వారలందరకు చూపులు నిల్పెడి గొప్పరూపులై**

**పేచిన కర్మడే కపుడు వేదన తీరెను వంశ వృద్ధియై**

**నోచిన నోములున్ వ్రతము న్యూనత నొందునె భాగ్యదాయిగా**

**వీచుగ సౌఖ్య సంపదల ప్రేముడి వాయువులన్ గ్రమంబుగా** **12**

## ధర్మదత్తుడు వ్యాపార భారమును మోయుట

**వ. ధర్మదత్తుడును అదే రీతిలో** **13**

**సీ. గోవింద కర్ణుడే కోరిన రీతిగా**
**నడచుచు గృహకీర్తి కిడియె దీప్తి**
**వ్యాపార మంతయు వ్యాప్తిని గావించి**
**దిగ్గజ వ్యాపారి నగ్గలించె**
**సత్య ధర్మమ్ముల నిత్యానువర్తియై**
**తలలోని నాల్కగా తనరి నిల్చె**
**సంప్రదాయమ్ములు సద్భక్తి పాటించి**
**చుట్టాల రాగమ్ము చూరగొనియె**

**తే.గీ.ధర్మ దత్తుండు జనతాళి దారి నెరిగి**
**తాను నాదారి నడిచె విజ్ఞాన మెసగ**
**నవ్య సూత్రాలు తలపోసి నవక మెసగ**
**ముఖ్య నేతగ పేరందె పురమునందు** **14**

**ఆ.వె. వయసు మీద పడగ వంగును దేహంబు**
**చేవ తగ్గు కట్టె చేతి కందు**
**నడువ కాళ్ళు రావు నరకంపు బాధయౌ**
**మనసు గుందు తనువు మంచమెక్కు** **15**

ఉ. కాలము నొక్కరీతిగను గాంచము మాయల లోకమందునన్
మేలగు కాలముల్ ముగియ మిథ్యగ దోచును జీవితమ్ము నన్
తూలును దేహమంతయును దూసరమైచను శక్తిమేనిలో
మూలము గాంచగా జరయె! మూలము నేరికి కాలమందునన్ 16

ఉ. కోరిన గొప్పవైద్యమును గూర్చుచు వారికి కంటిపాపయై
తీరగు సేవలన్ జరిపి దేవుని దల్చుచు నత్తమామలన్
పేరము లెట్టుచున్ దిరిగి పెన్నిధి యాయెను వారికంతకున్
వేరగు భావనల్ గనక వెన్నెల నిచ్చుచు సాగునక్కటా! 17

<u>గోవింద కర్వడే మరణించుట</u>

వ. ఇట్లుండ నొకనాడు గోవింద కర్వడే 18

చం. గడపను దాటుచుండగను కాలును జారగ నేలపై బడెన్
విడిచెను ప్రాణమచ్చటనె వింతగ దోచెను జూచువారికిన్
హడలిరి అంకితాసతి నహల్యయు మూర్ఛను బోయిరచ్చటన్
జడిసిన సేవకుల్ కబురు చల్లగ జెప్పిరి ధర్మపాలుతోన్ 19

తే.గీ. పరుగు పరుగున కారులో నరుగుదెంచి
దిక్కు వీడిన నొంటరి దీనుడవగ
గొల్లు గొల్లున ఏడ్చుచు కూలె నచట
శోక సాగర మాయెను లోకమంత 20

ఉ. ఏమని చెప్పగా వలయు ఏమగునోనని తల్లడిల్లుచున్
ఏమియు మాటలాడకయె  ఏడ్చుచు నిల్చెను తల్లిముందరన్
మోమును కాళ్ళపై నదిమి మూగగ రోదన జేయుచుండగన్
గోముగ లేవనెత్తుచును గూడిన వారలవైపు గాంచుచున్ 21

ఆ.వె. కన్న కొడుకు కంటె ఘనమైన వాడవు
ధర్మ మెరిగి నట్టి ధర్మ రవివి
కర్మ కాండ జేయ కర్తవ్య మీదయ్యె
దైవ లీల యనుచు ధైర్యమిచ్చె 22

ఆ.వె. వేల జనము వచ్చి వీక్షించి దు:ఖాన
మంచి మనిషి యనుచు మంది బొగడె
అతని సేవలెపుడు ఆదర్శ వంతమౌ
ననుచు నఖిల జనులు అంజలిడిరి 23

తే.గీ.దాన దక్షిణ లిచ్చెను దండిగాను
అస్థి కలనెల్ల గలిపెను  తానన్ని నదుల
శాంతి హోమాల జరిపించి సకల విధుల
విబుధ జనులకు బంచెను వెండి పసిడి 24

## ధర్మదత్తుడు తన కుమారులకు సద్బుద్ధులను నేర్పించి దేశసంచారమున కంపుట

**ఉ. పిల్లలు పెద్దవారయిరి పేర్మిగ నేర్చిరి ధర్మ సూత్రముల్**

**చల్లని నీడతీరుగను చక్కగ జెప్పెను వారికన్నియున్**

**మల్లెల తావిరీతిగను మంచిని వీడక గొప్ప బాటలో**

**మెల్లగ నిచ్చెనెక్కగను మేలగు మార్గము నేర్పెవారికిన్** 25

**ఉ.నేర్పెను దానధర్మముల, నేర్పెను వారికి దొడ్డ బుద్ధులున్**

**నేర్పెను గౌరవించుటను, నేర్పెను సంఘపు తీరుతెన్నులున్**

**నేర్పెను తారతమ్యములు, నేర్పెను నాణ్యత కార్యమందునన్**

**నేర్పెను కర్తడే తనకు నేర్పిన వన్నియు పొల్లుబోవకన్** 26

**ఆ.వె. తల్లిదండ్రులెటుల ధర్మాత్ములగుదురో**

**బిడ్డలటులె నడచి పృధివి యందు**

**మంచి కీర్తి తోడ మనుగడ సాగింత్రు**

**వంశ వృద్ధి జరుగు వాసి పెరుగు.** 27

**సీ. తనయుల బిలిపించి ధర్మదత్తుండంత**

**మీ జీవితమ్ముల మేలు దలచి**

**విషయంబు దెలిపెద వేగిర పడకను**

**ఆలకించుడు మాట ఆదరమున**

**మీరొక్క వర్షంబు మీరక నామాట**

**నేబంపు తావున నిలువ వలయు**

**స్వార్జిత కష్టంబు సాధక బాధక**

**విషయాల నెరిగెడి విధము నరయ**

తే.గీ. ధర్మ దత్తుని పేరును దలచకుండ

స్వంత పాదమ్ములన్ నిల్చి స్వార్జితముగ

వేతనమ్ముల నార్జించు విధము నేర్వ

వలయు పేరాశ పడకుండ వగవ కుండ 28

తే.గీ. బాగు గోరెడి వాడను బాధ వలదు

ఒక్క ఏడాది కాలమ్ము నోర్చుకొనుము

సర్వ సామాన్యు లుగమీరు సంచరించ

కాసు విలువను గ్రహియింప కలుగు సుఖము 29

తే.గీ. అనుచు వారల బంపింప నంకితకును

నచ్చ జెప్పెను పథకపు నంతరమును

ధనము నేమాత్ర మీయక తలను దాల్చి

సుతుల బంపుము లాలించి శుభములరయ. 30

వ. అని సుతులను వేరు రాష్ట్రములకు బంపించిన యనంతరము కొద్దిరోజులకు అహల్యాబాయి మరణము సంభవిస్తుంది. కర్మకాండలు సక్రమంగా జరిపిస్తాడు. 31

<u>స్వార్థపరులు వ్యాపార రంగమున దోచుకొనుటను దత్తు డడ్డుకొనుట</u>

ఉ. గందర గోళముల్ జరిగి గాడిని దప్పెను కొన్ని తావులన్

కొందరు దొంగలై ధనము కోరిన రీతిగ కొల్లగొట్టగా

ముందుగ దానినాపగను మొండిగ వారికి బుద్ధి చెప్పగన్

సందడి యాగెనంతటను చక్కగ దారికి వచ్చిరందరున్ 32

**తే.గీ.కర్మ కొలది రాబడి కానుపించు**

**అదియు హెచ్చు తగ్గులుగ, నయ్యది వారి**

**బుద్ధి బలమును బట్టియు, పూర్వ జన్మ**

**ఫలమును బట్టియు పొసగుచుండు. 33**

**కం.కొందరికి హెచ్చు లాభము**

**కొందరికిన్ నష్టము మరి కొందరికి మొగిన్**

**చెందును సరి సమముగ, నే**

**మందుము నొసటి పయి గీత నట్టుల చేయున్ 34**

## ధర్మదత్తుడు వేంగిపుర దోస్తును కలియుట - వేంగిపుర దుస్థితి తెలిసికొనుట

**ఆ.వె. తిరిగి వెళ్ళు వేళ తీరిక సమయాన**

**గుడికి వెళ్ళగాను గ్రుచ్చి గ్రుచ్చి**

**పట్టి జూచు నట్టి పాదచారిని జూడ**

**పలుకరించగాను పల్లె నేస్తు 35**

**ఆ.వె. చిన్నతనపు దోస్తు శీనయ్య వాడని**

**గుర్తుపట్ట గాను గుబులు తగ్గె**

**చిరుత ప్రాయ మందు చిలిపిగ నాడిన**

**ఆటలన్ని దలచి రచట వారు. 36**

**ఆ.వె. పల్లె తీరు నేడు పరమ ఘోరమ్మని**

**శీను గాడు చెప్ప చింత గలిగె**

**ఒక్కసారి వచ్చి ఊరుజూడమనంగ**

**వల్లె యనియె దత్తు పల్లె జూడ** **37**

## ధర్మదత్తుని కుమారుల దేశ సంచారము - గృహము జేరుట

**వ.ధర్మదత్తుని కుమారులిద్దరు తండ్రి యాజ్ఞ మేరకు ఆయా ప్రదేశములన్ దిరుగుచు** **38**

**శా.ఆయా ప్రాంతములందు గల్గు నదులన్నందుండు జీవాళులున్**

**లోయల్ కానలు పర్వతమ్ముల దరిన్ జూపట్టు జీవాళుల**

**న్నీ యా పట్టుల పల్లె సీమల కడన్ జీవించు వారిన్ లసత్**

**ధ్యేయోత్సాహ మతింగనుంగొనుచు స్పందించుచున్ సాగుచున్** **39**

**తే.గీ.ప్రజల కష్ట సుఖమ్ములు పండు పంట**

**లచటి వ్యాపార సరణులు - నమలు పరచు**

**తీరు - లభిరుచులు - బ్రతుకు తీరు తెన్ను**

**లన్నిటి గనుచు బుద్ధికి వన్నెలిడిరి** **40**

**కం.జనకుని యానతి తీరున**

**చనుచున్ - కావలసినంత జ్ఞానశ్రీలన్**

**వొనుపగు ననుభవము ప్రజా**

**గణ గుణ జీవనమ్ము గైకొని పిదపన్** **41**

**ఆ.వె.మురిసి మరి యరసి తిరుగుచు తిరుగుచు**

**గడువులోన వలయు నడతలెన్నొ**

**తెలిసికొని కనులకొన వాని తిలకించి**

**పూర్ణ బుద్ధితోడ పొంది కలర** **42**

**ఉ. చేరిరి చెప్పినట్లువిని చెడ్డను మంచిని గాంచి గాంచిరంతటస్**

**ఘోరపు సంఘతీరునకు  గోచరమయ్యెను సర్వ బాధలుస్**

**దారుణ రీతిగా గడచె ధర్మము న్యాయము జూడరెవ్వరుస్**

**వేరుగ వర్షముండగను వెల్గెను వారికి జ్ఞానదీపముల్.** **43**

**తే.గీ. సుతుల మాటల కానంద శోభ గలిగి**

**వివిధ ఆదాయ మార్గముల్ వెదకు మనుచు**

**కొన్ని పనులను వారిని కూడి చేయ**

**ఆనతీయ సుతద్వయ మనుసరించె.** **44**

## <u>ధర్మదత్తునికి శంకరుడు స్వప్నములో నగుపించుట</u>

**వ. ఇట్లుండ ఒక నాడు తెల్లవారు ఝామున** **45**

**సీ. కలత నిద్రన నుండ కలవచ్చె దత్తునకు**

**శంఖ నాదము జేసె శంకరుండు**

**కాలకంఠుని గాంచి కళవళ పడగాను**

**పలికిన పలుకుల భయము గొలిపె**

"కోట్లకు పడగెత్తి కూడబెట్టిన నీవు

సతియు సుతుల తోడ చల్లగుండ

కూటికి లేనట్టి కోట్లాది ప్రజలెల్ల

కడుపులు నిండక కమిలె బ్రతుకు"

ఆ.వె. ఉలికి పడుచు లేచె! ఉదయపు రాకకు

కొంత పొద్దు ఝాము కూడి యుండె

శుభము నిచ్చు నట్టి సోమ శేఖరుండు

జన్మ కారణంబు జ్ఞప్తి జేసె. 46

ఆ.వె. అనుచు దలచి లేచి యానాడు శివపూజ

జరిపె దత్తుడంత జక్కగాను

సతియు సుతుల గూడి సాగిల పడిలేచె

నమక చమక సహిత నమసులిడుచు 47

<u>ధర్మదత్తుడు కర్తవ్య విస్మరణ గావించితినని ఆవేదనాపరుడగుట</u>

వ. ఆరోజు రాత్రి ఆలోచనా నిమజ్జుడాయెను. 48

ఉ. పల్లెకు మేలుజేయగను పట్టిన దీక్షకు మాయ గ్రమ్మెనే!

ముల్లెలు మూటలంచుచును మూలధ నమ్ము న బానిసైతినే!

చెల్లని రూకలస్ భ్రమయ చేతులు గాలెను చాలునక్కటా!

చెల్లెను రోజులింకమరి చేయగ బూనితి నమ్ము మీశ్వరా! 49

**తే.గీ. మరువ కర్తవ్య దీక్షను మందలించి**

**కళ్ళు తెరిపించి నిల్చిన గరళ కంఠ!**

**నాకు వెన్నుగ నిలువుము నాద నిలయ!**

**అండ నిలువుము కార్యంబు నరయగాను. 50**

**ఆ.వె. జనని జన్మభూమి జాతికె గర్వంబు**

**పల్లె పట్టులెల్ల తల్లి దలచి**

**గాంచ వలెను మనము ఘనమతి తోడుతస్**

**గ్రామ మన్న మనకు కల్పవల్లి 51**

**<u>ధర్మదత్తుడు వేంగిపురమునకు పయనమగుట</u>**

**వ.మరుసటి ఉదయము ధర్మదత్తుడు వేంగి పల్లె శివార్లలో నుండగా. 52**

**తే.గీ. పూడ్చ శిశువు శవము పూని యున్న**

**జనుల గుంపు జూడ జాలి గలిగి**

**వివరమడగ గాను విపరీత శోకాన**

**కుమిలి కుమిలి యేడ్చి కూల బడిరి 53**

**ఆ.వె. పొట్ట నొప్పి యనుచు పొర్లిదొర్లేడ్చెను**

**తాళ లేనటంచు తల్లడిల్లె**

**తెల్లవార నొడలు చల్లబడె నకటా!**

**ఆరు వత్స రములె అనుచు వగచె 54**

## ధర్మదత్తుడు గ్రామసభలో ఊరికి వలసిన వసతులనేర్పాటు గురించి వివరించుట

వ. అని కోపించి పలికిన వారి మాటలకు చింతాక్రాంతుడై వేంగి పల్లెను జేరి, గ్రామ పెద్దలతో నొక సభ నేర్పాటు జేసి 55

ఉ.పెద్దలు కోపగింపకుడు పిల్చితి మాటలు కొన్ని చెప్పగన్
ముద్దుల బిడ్డగా నిచట మోదము నందితి బాల్యమందునన్
మద్దతు నీయగా వలయు మాన్యత నాకొక మూడు మాసముల్
మద్దతు గోరినిల్చితిని మంచిని జేయగ వేంగికిప్పుడున్ 56

ఉ.పల్లెను వీడితిన్ నిజము! భావిని దల్చుచు వృద్ధిగోరుచున్
చల్లగ నాదరించెనను చక్కగ దిద్దిరి దత్తతందగన్
చల్లని దీవెనల్ ఫలమె! చాలిన సంపద పొందగల్గితిన్
పల్లకి నెక్కుటన్ మరిగి పాడయి పోయెను జ్ఞాన మక్కటా! 57
ఆ.వె. సాంబ శివుడు నన్ను చక్కగా మేల్కొల్పె
బోధ జేయ నాకు బుద్ధి వచ్చె
చాల తప్పు జరిగె జాప్యంబు జరిగెను
పెద్ద మనసు తోడ మద్దతిండు 58
వ. అని వారిని మేల్కొల్పి, వూరికి నేమేమి చేయవలయునో నేమేమి
కావలయునో అన్నింటిని నిట్లు తెలిపెను. 59

ఉ. ముందుగ వైద్యశాలయును ముచ్చట గొల్పెడి పాఠశాలయున్
అందరి దాహచింతనయు నక్కర దీర్చెడి నీటిపంపులన్
సుందరమైన రోడ్లకును సూచన గావలె యోచనమ్ముతో
అందగ మానసోల్లసము నందరు గొల్చెడి దేవళమ్మునున్ 60

వ. నిర్మించ సంకల్పించినట్లు తెలిపి 61

ఆ.వె.వేంగి పల్లె పేరు వినిపింప ఘనముగా
ప్రజలు నిలుప వలయు ప్రగతి రథము
రాష్ట్రమందు మనమె రాణించ వలెనయ్య
ననుచు నిల్చి పలికె నందరెదుట 62

తే. గీ. మూడు మాసాల గడువని ముదము తోడ
ధర్మదత్తుండు చెప్పంగ తలల నూచి
సోమ శేఖరు డిట్టుల ప్రేమ మెరయ
వచ్చె మాయూరి కనుచును ప్రజలు తలచె 63

వ. అనుచు శివాలయమును దర్శించి, జనాంతికముగా 64

ఉ.వాలిన భక్తితో గొలిచి, వాకిట నిల్చిన వారి జూచుచున్
మేలగు రోజులొచ్చునిక , మీరక యుండగ న్యాయధర్మముల్
మూలము నన్నికర్మముల మోసపు ధోరణి వీడగావలెన్
శీలము గొప్పదై నిలువ చిక్కులు దాకవు మానవాళినిన్ 65

## <u>ఆశ్వాసాంత పద్యములు.</u>

భుజంగ ప్రయాతము: హరా! రుద్ర! సర్వేశ! అంబా వినోదా!
వరాధీన చిత్తాబ్జ భావప్రపూతా!
కరీంద్రాత్మ సంచార కార్య ప్రయత్నా!
సుర ప్రార్థనాసక్త! శూలీ! మహేశా! 66

(య,య,య,య 1-8 యతి, ప్రాస ఉన్నది- అప్పకవీయం - క్ర.సంఖ్య - 84)

**తోటకము: కరుణా భరణా! కనకాద్రి విభూ!**

**వర భక్త గణాంగణ భద్ర చరా!**

**హర! లోకపతీ! పరమాదరతస్!**

**ధరణీ జనతాళి సదా కనుమా!** 67

**(స,స,స,స, 1-9 యతి, ప్రాస ఉన్నది- అప్పకవీయం - క్ర.సంఖ్య - 85)**

**ఆశ్వాసాంత గద్యము: ఇది శ్రీవాధూలస గోత్ర పవిత్ర టేకుమళ్ళ హనుమాయమ్మా సుబ్రహ్మణ్యాఖ్య చతుర్థ పుత్ర, సహృదయ, కవిమిత్ర, శ్రీపరమాత్మ గురుకటాక్షవీక్షణాలబ్ధ సారస్వతమర్మ వేంకటప్పయ్యశర్మ ప్రణీతంబైన ధర్మదత్తోదయంబను ప్రబంధంబున చతుర్థాశ్వాసంబు సమాప్తము.**

**-o0o-**

# పంచమాశ్వాసము

**కం. శ్రీ పాండురంగ విఠలా!**

**దాపున నిలుచుంటి నేను ధైర్యమునిమ్మా!**

**దీపము జూపుము నాకిటు**

**పాపపు చింతనలులేని బాటలనడువన్. 1**

**<u>ధర్మదత్తుడు అన్యమనస్కుడై వుండుట గాంచిన అంకిత కారణమేమని  ప్రశ్నించుట</u>**

**వ. ధర్మదత్తుడు వచ్చినప్పడినుండి తీవ్ర ఆలోచనా పరుడైన సంగతి గమనించిన**

**అంకిత భర్తతో 2**

**తే.గీ.అన్య మనమున మీరుండ అడుగుచుంటి**

**బాధ నందుచు లోలోన పగలు రాత్రి**

**దిగులు నొందుచు నుంటిరి తిండి మాని**

**ధర్మ సంగతు లెరిగితి తమరి కరుణ. 3**

**తే.గీ.నాథ! విషయమ్ము నెఱిగింప నాకు మీరు**

**బాధ తెలిపిన కష్టముల్ పంచుకొందు**

**అనుసరించెద మీబాట ననవరతము**

**శంక వీడుము! చెప్పుము! శాంతి గలుగు. 4**

**వ. అని పరిపరి విధమ్ముల భార్య ప్రాధేయపడగా 5**

**ధర్మదత్తుడు తన స్వప్న వృత్తాంతమును వేంగి బాగుకై వెళ్ళవలసిన అగత్యము దెలుపుట**

**ఉ.అంకితకంతయున్ దెలిపె నావిషయంబుల నర్ధరాత్రమున్**
**శంకరు నాజ్ఞకున్ నిలుచు శాసన బద్ధుడ జన్మభూమికై**
**కంకణ దీక్షధారుడను, కాదని చెప్పక నండనిల్వుమా!**
**వంకలు జెప్పగా వలదు వాదన జేయక మద్దతీయుమా! 6**

**వ.అని పలికిన భర్త పలుకులకు 7**

**ఆ.వె. ధనమదున్నలేక దారిద్ర్యమందైన**
**భర్త తోడు నీడ భార్య యనుచు**
**కలసి నడువగవలె కలకాల మోర్మితో**
**అద్ది మనుజ ధర్మ మగును ధరణి 8**

**వ.అనిన మాటలకు ధర్మదత్తుండు మిక్కిలి సంతసించి 9**

**ఉ.తల్లివి బిడ్డలిర్వురకు తప్పదె యుండక కొంతకాలమున్**
**చల్లని తోడునీడయగు చక్కని యిద్దరు సుందరాంగులన్**
**తొల్లిటు గాంచగా వలయు దూతల నంపెద నట్టికార్యమై**
**చెల్లగ బాధ్యతల్ మరల చేరగ వచ్చును వేంగి పల్లెకున్ 10**

**వ.అని ధర్మదత్తుడు పలుకగా అంకిత 11**

**తే.గీ.సీత రాముని తోడాయె చింతలేక**

**కోటి బాధలలో నిన్నుకూడి వత్తు**

**సుతుల పెండ్లిండ్ల ముచ్చట చూచి మనము**

**వెళ్ళ వలయును జంటగ వేంగి కపుడు** **12**

**వ. అని పలికి నలుదిక్కులకు మధ్యవర్తులనంపగా** **13**

**<u>ధర్మదత్తుడు సుతులకు వివాహము గావించి ఆస్తిని పంచి యిచ్చి తన ఆంతరంగమెరింగించుట</u>**

**తే.గీ.గొప్ప వ్యాపార వేత్తలు కోరి రాగ**

**వియ్య మందుట కొఱకునై వేగ పడగ**

**బుద్ధిమతులగు కొమ్మలస్ పుడమి వెదకి**

**ఇంటికోడళ్ళ చేసె సంతృప్తి తోడ** **14**

**తే.గీ.న్యాయవాదుల రావించి న్యాయమెరిగి**

**విషయమెరిగించి తనయొక్క విత్తమందు**

**వేంగి బాగుకు ద్రవ్యమ్ము వేరు జేసి**

**ఆస్తి పంచెను సుతులకు ఆదరమున** **15**

**తే.గీ.గొప్ప శోకంబు మునిగిరా కొడుకులపుడు**

**ఆపు జేయగ గోరిరి అమ్మనపుడు**

**తల్లడిల్లిరి కోడళ్ళు తగ దనంగ**

**ధర్మదత్తుండు జేసెను తత్త్వబోధ** **16**

**ఉ.పుట్టితి బీదవానిగను పూర్తిగ కూటికి గుడ్డకేడ్చుచున్**

**వెట్టిగ రైతు జీవమున వేదన బొందిన మాతవీడగన్**

**గిట్టక పల్లెనొగ్గితిని గీచిన రాతలు తప్పవెన్నడున్**

**మెట్టగ నిచ్చటన్ కడకు మిక్కుటమాయెను కోటి కోర్కెలున్** **17**

**వ.అని తన జన్మవృత్తాంతమంతయు నెరింగించి** **18**

**తే.గీ.తప్ప బూనుట శివుడాన ధర్మమేన?**

**పల్లె యందున జనమెల్ల బాధ లందు**

**రోగ పీడన మందున రోదనంది**

**బ్రతుకు లీడ్చగ చూచుట పాడి యగునె?** **19**

**తే.గీ.వేదవేత్తలు నాజన్మ విధిని గాంచి**

**పల్లె బాగును జేసెడి బాలు డనిరి**

**కోటి యాశల తోడుగ కోరు కొనుచు**

**ఎదురు జూచెడి జనమున కేమి సేతు?** **20**

**తాతగారి వంశకీర్తి నిలుపవలసినదిగా కోరుట**

**ఉ.చేయుడు వర్తకమ్ములను, చేసిన బాసల వీడకెన్నడున్**

**కాయుడు బీదసాదలను, కావరమున్ విడనాడి ప్రేమతో**

**బాయకు డెన్నడున్ నిజము, న్యాయము ధర్మము భద్ర సంస్కృతిన్**

**పూయును జీవితమ్ములిల పూర్వపు పుణ్యము నిల్వయుండగన్** **21**

**ఆ.వె.గొప్ప కీర్తి బొందె గోవింద కర్షడే**

**తాతగారి ఘనత దలచి మీరు**

**బాధలెన్ని యున్న పద్ధతుల్ వీడక**

**నడువుడయ్య ధరణి న్యాయమెరిగి.** **22**

**<u>ధర్మదత్తుడు, భార్య వేంగి గ్రామము ప్రవేశించుట</u>**

**వ.ధర్మదత్తుండు భార్యతో గూడి వేంగిపల్లెను ప్రవేశించి.** **23**

**ఆ.వె. చిన్న పెంకుటింట చేరిరి యిరువురు**

**సర్వ సుఖములొడ్డి సర్దు కొనిరి**

**భర్త చిత్తవృత్తి పట్టమున్ గట్టంగ**

**తోడు నడిచె మరియు నీడయయ్యె** **24**

**ఉ.వేంగిపురమ్మునన్ విరిసె వేడుకరోజులు మూలమూలలన్**

**రంగుల తోరణమ్ములట రాజ్యము చేసెను వీధి వీధులన్**

**బెంగను వీడిరా ప్రజలు పీల్చిరి యూపిరి సంతసమ్మునన్**

**రంగము సిద్ధమాయెనిక రాతను మార్చగ వేంగికప్పుడున్** **25**

**<u>ధర్మదత్తుడు వైద్య శిబిరాలను ఏర్పాటు చేయుట</u>**

**తే.గీ.వైద్య శిబిరాలు పెట్టించి వాడ వాడ**

**మంచి మందుల నిప్పించి మంది కెల్ల**

**ధూమపానమ్ము మద్యమ్ము దూర ముంచి**

**మంచి అలవాట్ల నేర్పించి మార్పు దెచ్చె** **26**

**ఉ.గొప్పగు ఇంజినీరులట గూడిరి మంచి పథాళి వేయగన్**

**చెప్పిన మాటలెల్లయును చేతల జూపెడి కార్యశూరులై**

**చెప్పిన రీతిలో తగిన చేర్పులు మార్పులు చేయబూనుచున్**

**నప్పెడు రీతిగా పనులు నాణ్యత తోడుగ సాగుచుండగన్ 27**

**తే.గీ.ధర్మదత్తుని ఘనతకు తరలి వచ్చి**

**చుట్టు ప్రక్కల ప్రజలెల్ల చూడ వచ్చి**

**అన్ని గ్రామాల జనులను ఆదరింప**

**వలయు ననుచును గోరిరి వానినపుడు 28**

**ఆ.వె.ధర్మ రాజు మరల ధరపుట్టె గానంచు**

**దాన కర్ణుడనుచు దండ మిడిరి**

**విద్య వైద్యమెల్ల వేంగికే గాకుండ**

**విస్తరిం చుడను వేడినంత 29**

**వ. అనగా ధర్మదత్తుండు 30**

**తే.గీ. వేంగి వాసుల కన్నింట వెసులు బాటు**

**వంద పడకల ఆస్పత్రి వచ్చు నిచట**

**బడుల యందున విద్యను బడయ వచ్చు**

**సమయ మున్నది యని పల్కి సాగనంపె 31**

## ధర్మదత్తుడు మంచినీటి వసతినేర్పాటు చేయుట

**వ. మున్ముందుగా ప్రజలు మంచినీళ్ళకై పడుచున్న బాధలను గాంచి దాహార్తిని తీర్చదలచి. 32**

**ఉ.గ్రుక్కెడు మంచినీళ్ళకును కోరిక తీరని పేదవారలున్**
**చక్కటి పంపులన్ గనుచు సంతసమందిరి గంతు వేయుచున్**
**తొక్కిసలాటలన్ మరచి తోయము నందిరి యెల్లవేళలన్**
**ఎక్కడనుండి వచ్చెనిట? ఎప్పటి బంధము? ధర్మదత్తుడా! 33**

**వ.అని ప్రజలు వేనేళ్ళ పొగడిరి 34**

**మం.ద్వి. "ధర్మపాల జలపథక" మనుపేర**
**అంకితమును జేసె అందరికప్పుడు 35**

## వేంగిన గుడి గాలిగోపురము, గోడలు కూలుట, పునరుద్ధరణ చర్యలు

**ఆ.వె.వేంగి గుడిని గట్టి వేయేళ్ళు దాటెను**
**కూలె చాల చోట్ల గోడలన్ని**
**పూజ సలుపు చుండ పూజారి యొకనాడు**
**గాలిగోపురమ్ము కదిలి పడెను 36**

**తే.గీ. భక్తు లెల్ల జడిసి పరుగెత్తి పోవంగ**
**జనుల నష్టమేమి జరుగ లేదు**
**ఆస్తి నష్టమాయె అంగళ్ళు కూలంగ**
**గొల్లు మనుచు నేడ్చి గోల చేసి 37**

ఉ.చెప్పిరి ధర్మదత్తునకు చేటగు నిట్టివి యూరికంతకుస్

తప్పక గోపురమ్ములను తక్కిన వానిని యుద్ధరించగా

చెప్పెను వారికిస్ భయము చెంతకు రాదని వేంగికెప్పుడుస్

చెప్పిరి వేదపండితులు చేయగ నాగమ సూత్రపద్ధతుల్ 38

సీ.శ్రీకాళహస్తిన శ్రీకృష్ణమాచారి

దుర్గి పల్లెన యున్న దొడ్డ శిల్పి

అమరావతి నున్న ఆగమవేత్తలు

ఉత్తరదేశపు ఉడయవర్లు

కబురంది వచ్చిరి గాంచగ నచ్చట

ధర్మదత్తుడపుడు తగిన రీతి

వినిపింప గోరెను వేద విధానమ్ము

సమయ మడిగిరంత సంతసించి

తే.గీ.గాలిగోపుర ప్రాంతమ్ము కలిసి తిరిగి

గుడిని దర్శించి కూలిన కుడ్యమరసి

తిరిగి నిర్మించు పద్ధతుల్ దేల్చి రపుడు

ధర్మదత్తుకు వినిపింప ధనము వ్యయము 39

ఉ.విత్తము చింత చేయకుడు వేంగికి ఖ్యాతిని దెచ్చురీతులస్

పుత్తడి దేవళంబునకు పోయిన కాంతులు చేరునట్లుగా

చిత్తము దీనిపై నిలిపి చేయగ బూనుము కార్యమక్కటా!

మొత్తము కార్యభారమును మోయుడు మీరలు పూర్వశోభకై 40

తే.గీ.అనగ వారెల్ల మిక్కిలి అబ్బురముగ
దేశదేశములెన్నియొ తిరిగినాము
కాన రాలేదు తమవంటి కర్మశీలి
అనుచు బల్కిరి శిల్పులు వినయ రీతి 41

వ. అనంతరము వారి వారి కార్యక్రమంబునకు బూనుకొని. 42

ఉ. పల్లవ శిల్పచాతురిని పంచెడు రీతిగ గొప్పనేర్పుతో
చెల్లెను నాటి శిల్పమని చెప్పెడు వారల చెంపపెట్టుగా
పల్లెన దేవళమ్మునకు పట్టిన శోభకు మంత్రముగ్ధులై
యెల్లర కున్మదాతిశయ మేర్పడ జేసిరి శిల్పులచ్చటస్. 43

<u>వేంగిన పాఠశాల నిర్మించుట</u>

ఉ.ఉన్నత పాఠశాలయును ఉత్తమబోధన జేయునొజ్జలుస్
అన్నిట మిన్నయై నిలువ నాటల నేర్వగ గొప్పభూమియుస్
మిన్నగ నాట్యగానముల మెప్పును బొందగ నాట్యశాలలుస్
పున్నమి వెన్నెలై కురిసి స్ఫూర్తిగ నిల్చెను రాష్ట్రమంతటస్. 44

తే.గీ.గాలి ధారాళమై వచ్చు గదులతోడ
కార్పొరేటు బడుల ధాటి గాను నిల్చు
దృశ్యము శ్రవణ మాధ్యమ దృష్టి నిలిపి
పాఠ శాలను నిర్మించె ప్రగతినెంచి 45

తే.గీ.ధనము గలిగిన వారెల్ల తరలి వచ్చి

సీటు నిమ్మని కోరగ చేర దలచి

ద్రవ్యమెంతైన యిచ్చెడు దారి లోన

వరుస గట్టిరి పిల్లల భవితనెంచి 46

వ. వారికి ధర్మదత్తుడు విద్య, వైద్యము, జలము ఖరీదు గట్టజాలము.

వేంగి ప్రజలకవసరములకు బోను మిగిలిన వనరులననుభవింపుమని సెలవిచ్చెను. 47

<u>వేంగిన గొప్ప వైద్యశాలను నిర్మించుట</u>

ఉ.సేవగ దల్చివైద్యమును చేయగ బూనెను పల్లెకంతకున్

భావిని బాధ్యతల్ గనుచు బంగరు బాటల వేయనిల్చితా

దేవుని యానగా దలచి దీనుల గాచుటె లక్ష్యమెంచితా

జీవన చక్రమందునను జిక్కిన పేదల మేలు దల్చుచున్ 48

ఆ.వె.గొప్ప హాస్పిటలును కోరిన రీతిగా

పైస ఖర్చు లేని పసిడి గుడిగ

వేంగి పల్లె నందు వెలయించె ప్రీతిగా

వంద పడకలున్న వైద్య శాల 49

ఉ.దేశము నంతకున్ మిగుల దీటగు వైద్యము పల్లెయందు హ్యాత్

పేశలమున్నవైద్యులను, ప్రేముడి చూపెడునట్టి నర్సులున్

ఆశయ సిద్ధికై నిలిపె నచ్చట దత్తుడు సర్వవేళలన్

దేశము నేలు నేతలును దిమ్మెర వోయిరి వేంగి గాంచుచున్ 50

## వేంగి-హేలాపురి రహదారి నిర్మాణము గావించుట

ఆ.వె.బురద, గోతులందు పోవంగ నరకమౌ

రోడ్డు నందు నడక రోత గలిగి

వెతల నుండు పల్లె వేచెను బాగుకై

యేండ్లు పూండ్లు గడిచె నేమి ఫలము? 51

ఉ.కాంచెను ధర్మదత్తుడది కష్టము దోచెను పల్లెబాధలుస్

మంచిగ ముఖ్యమంత్రికిని మాన్యులకెల్లను లేఖ రాసెతా

కొంచెము సాయమీయగను కోరగ వారిని గౌరవమ్ముగా

అంచెల వారిగా ధనము నచ్చట చేరెను రోడ్డుబాగుకై 52

ఆ.వె.తారు రోడ్డు నేసి దారిని మంచిగా

తీర్చి దిద్ద గాను దివ్య రీతి

ముఖ్య మంత్రి వచ్చి ముదమందె తృప్తిగా

ధనము లెక్క చెప్పె ధర్మ దత్తు 53

## ముఖ్యమంత్రిచే వేంగి-హేలాపురి రహదారి ప్రారంభోత్సవము

వ. వేంగి-హేలాపురి రహదారి ప్రారంభోత్సవ సభలో ముఖ్యమంత్రి 54

తే.గీ.వంద కోట్లకు పడగెత్తు వాడు గాని

కూడు లేకను మరణించు కూలి గాని

మట్టి గలియుట తథ్యంబు మహిని తుదకు

మరచు లోకంబు నిరువురి మరుదినంబె 55

**తే.గీ.మంది మేలును గాంచెడి మనిషి ధరణి**

**దైవ సమునిగ తలచుట తథ్య మనఘ!**

**తలుచు ప్రజలెల్ల వానిని తరములెన్నొ**

**ధర్మ దత్తుండు దానికి తగిన ఘనుడు. 56**

**<u>ముఖ్యమంత్రిచే ధర్మదత్తుని ఘనతను దెల్పుచు గవర్నరు మరియూ రాష్ట్రపతులకు లేఖ బంపుట</u>**

**తే.గీ. ముఖ్యమంత్రియు తలపోసె నుర్వియందు**

**ధర్మ దత్తుని పోలెడు దాతవరుల**

**రాష్ట్రపతి గారి దృష్టికి రాగఫణితి**

**తీసుకొని వచ్చి వారికి దృష్టి మీర 57**

**కం. గౌరవము తోడ భారత**

**పౌరులెదుట తగిన రీతి వర సన్మానం**

**బేరుపరచి చేయగవలె**

**దారా చిత్తమ్ము మెచ్చ తనయులు మెచ్చన్. 58**

**కం.వెను వెనుకనె సహచరులన్**

**ననువుగ బిలిపించి తనదు నాలోచనలన్**

**వినిపించి ధర్మదత్తుని**

**గుణముల వినుతించె వారు కోవిదులగుటన్ 59**

**తే.గీ.తగిన యట్టుల పథకమ్ము లొగి రచించి**

**ధర్మదత్తుని పేరును దాననిరతి**

**భద్ర గుణమున చేసిన పనుల తీరు**

**వరుస వరుసగ రాష్ట్రపతికి తెలిపి 60**

కం.మాన్యుస్ సన్మానింపుడు
మాన్యుగ భావించి మీరు మానితబుద్ధిస్
మాన్యా! యంచుస్ లేఖను
మాన్యుండౌ రాష్ట్రపతికి మనసిడి పంపస్ 61

వ. కొద్ది మాసములు ప్రశాంతముగ గడచిపోయెను. మరుసటిరోజు శివరాత్రి పర్వదినము కాగా ముందురోజు తెల్లవారుఝామున ధర్మదత్తున కొక స్వప్నము రాగా ఆ వృత్తాంతంబును ఉదయము భార్య అంకితకు నెఱింగించెను. 62

<u>ధర్మదత్తుని చరమఘట్టమున స్వప్నము, దానిని కులగురువు ఖండోబా వివరించుట</u>

సీ. శంకర తేజమ్ము, శంఖారవంబును
కలలోన నిప్పుడు గంటి, వింటి
ఘన శివలింగమ్ము కనుపించె నంతట
వేవేల జ్యోతుల వెలుగులందు
హంసలు గుంపులై ఆకాశ మార్గాన
ఎగిరెడి దృశ్యంబు నెఱిగితేను
గరుడ వాహనమెక్కి గగన వీథిననేను
తేలిపోవుట గంటి దివ్య లీల.

ఆ.వె.దీని భావ మేమొ తెలియంగ వలయును
చెప్ప వలెను గురువు తప్పకుండ
తలచి నంత వేగ తాబట్టి చరవాణి
కలన గనినట్టి విషయమ్ము కథగ జెప్పి 63

**తే.గీ.తెలియ జెప్పంగ గోరెను తేట పరచి**

**వినిన ఖండోబ చెందుచు విస్మయంబు**

**ధర్మ దత్తుని మరణ నిదర్శనమ్ము**

**నిద్ధి చెప్పంగ వలయును సుహ్రుత్ విధాన** **64**

**వ. అని ఖండోబా పరి పరి విధముల తలంచి యిట్లు చెప్పెను** **65**

**సీ. నీగత జన్మంబు నిరుపయోగంబయ్యె**

**అతి చిన్న వయసున ఆయువుడిగె**

**మరణించు సమయాన మాధవుం డగుపించి**

**తరువాయి జన్మంబు తథ్యమనగ**

**మంది కుపకరించు మానవ జన్మను**

**ఎత్తంగ గోరంగ ఎనలేని ప్రేముడి**

**నినుగాచి తలయూచె నింగి వేల్పు**

**గోవింద కర్హడే గోత్రోద్భవుండవై**

**యీరీతి నీపుట్టు వృద్ధి చెందె**

**తే.గీ.జన్మ సార్థక మాయెను జన్మ ముగిసె**

**తరలి వెళ్ళంగ వలసిన తరుణ మిదియె**

**చివరి రోజిది నీకని చెప్ప వలయు**

**జన్మ లేదిక నీకును జాతకమున** **66**

## ధర్మదత్తుని ప్రాయోపవేశము, ఆలయమున కపాల మోక్షము

వ .అని ఖండోబా నిక్కమెరింగించ, కొడుకులు కోడళ్ళను అత్యవసరముగా పిలిపించ వలసినదిగా భార్యను కోరి, అభ్యంగన స్నానమాచరించి పరిశుద్ధుడై శివుని ఎదుట ప్రాయోపవేశ విధమ్మున శివాలయము ముందు మౌన వ్రతదీక్షలో గూర్చుండె. 67

చ. శంకర దీక్షలో నిలిచి సత్వర మోక్షము గోరినిల్వగా
అంకిత మౌని దీక్షగొని యచ్చట జేరగ భర్తనీడగా
అంకిత భావముస్ సుతులు నాలుల గూడిరి శైవపూజలో
శంకర శాంకరీ భజన సాగుచు నుండగ యర్ధరాత్రముస్ 68

వ.శంఖధ్వానములు సాగుచుండగా 69

తే.గీ. ధర్మ దత్తుండు సాష్టాంగ దండము నిడి
దివ్య పద్మా సనంబున దీక్ష బూని
అసువు లిడువగ గుడినందె అమరుడయ్యె
జనులట కపాల మోక్షంబు జరిగెననిరి 70

తే.గీ.జనులు తండోప తండమై జనిరి వేంగి
పుణ్య శీలిగ కీర్తించె పుడమి నందు
వాని దహనంబు జేయంగ వలెను గనుక
పల్లె పల్లెలు కదలెను పరమ భక్తి 71

**ధర్మదత్తుని భౌతిక కాయమునకు దహన సంస్కారములు గావించు సమయమున రాష్ట్రపతి అవార్డు విషయము నెరిగించుట**

**వ. దహన కార్యక్రమ మంత్రములు చదువుచుండగా 72**

**ఉ.చేరిరి ఎందరో జనులు చెప్పుచు నాతని కీర్తిసంపదల్**
**బారులు తీరియచ్చటను  భళ్ళున తీయుచు కారుద్వారముల్**
**దారిని జూపగా నడిగె ధర్మని యింటికి వారినప్పుడుస్**
**ఘోరము జెప్పివారికిని గొల్లున నేడ్వగ వారలచ్చటస్ 73**

**వ. తాము భారత రాష్ట్రపతి తరఫున గవర్నర్ కార్యాలయము నుండి**
**వచ్చితిమని వచించి. 74**

**ఆ.వె.భరత ఖండ మందు భావిజను లకతడు**
**దారి జూపినట్టి ధర్మమూర్తి**
**రాజ ధాని కతని రావించి మంత్రులు**
**గొప్ప బిరుదు నీయ గోరినారు 75**

**ఆ.వె.ఇప్పు డిట్టులయ్యె ! ఎంతయో గష్టంబు!**
**భార్య నంపు డనుచు బాధ పడిరి**
**కొరివి పెట్ట కొడుకు గొల్లున నేడ్చుచు**
**కాగి తముల నిచ్చి సాగిరంత 76**

**ధర్మదత్తుని శిలావిగ్రహము నిర్మించుట - జన ఘన నివాళి**

**ఉ. ఊరి శివార్ల యందులలి నుంచిరి స్మారక చిహ్నముస్ జనుల్**
**మేరలు దాటుచుస్ మిగుల మించెడు భక్తిని వచ్చి చూచుచుస్**
**వీరలె ధర్మదత్తుడొక ప్రేముడి దైవమటంచు మ్రొక్కుచుస్**
**నీరజనాభుడౌ హరి ననేక విధాల నుతించుచుస్**
**హారతు లిచ్చినారు. పరమాత్ముని లీలల నెన్న శక్యమే!. 77**

**వ. అనుచు మార్కండేయ మహర్షి ధర్మదత్తుని గాధను సాంగోపాంగముగా వివరించి ఈవిధముగా ఫలశ్రుతి నొసంగెను. 78**

**ఫలశ్రుతి**

**తే.గీ.ధర్మదత్తుని గాధను ధరణి నందు**
**వినిన వారలు, వినిపించు విబుధ జనులు**
**కలియుగమ్మున కడగండ్ల కమల రనుచు**
**తరలి వెళ్ళెను యామౌని తపము జేయ 79**

# ఆశ్వాసాంత పద్యములు

**అనుష్టుప్**

**టేకుమళ్ళ సుధాజాత: వేంకటప్పయ్య సద్బుధ: |**
**వ్యలిఖత్ భద్ర సద్భావై: ప్రబంధం సరసాత్మకమ్|| 80**

**అనుష్టుప్**

**అద్య భారత రాష్ట్రానాం సమాజోద్యమ సంగతీమ్|**

**ప్రజా బాహుళ్య సిద్ధాంతాస్ వర్ణితం పఠ పాఠక! ||** **81**

**మంగళం మహాశ్రీ:**

**మంగళము స్వర్పతికి, మంగళము సూర్యునకు, మంగళము రేమగనికిస్ స**

**న్మంగళము నీటికిని, మంగళము వహ్నికిని, మంగళము వాయువునకుస్ స**

**న్మనగళము నింగికిని, మంగళము ధాత్రికిని, మంగళము వేల్పుతతికిస్ స**

**న్మంగళము ప్రాకృతిక మంజుల మనోజ్ఞతకు, మంగళము జీవతతికెల్లస్.** **82**

**(అప్పకవీయము పుట 209 - భ,జ,స,న, భ,జ,స,న,గ గ యతి 1-9-17, ప్రాస యున్నది)**

**ఆశ్వాసాంత గద్యము:** **ఇది శ్రీవాధూలస గోత్ర పవిత్ర టేకుమళ్ళ హనుమాయమ్మా సుబ్రహ్మణ్యాఖ్య చతుర్థపుత్ర, సహృదయ, కవిమిత్ర, శ్రీపరమాత్మ గురుకటాక్షవీక్షణాలబ్ధ సారస్వతమర్మ వేంకటప్పయ్యశర్మ ప్రణీతంబైన ధర్మదత్తోదయంబను ప్రబంధంబున పంచమాశ్వాసంబు సమాప్తము.**

**-o0o-**